# శ్రీశ్రీ



# కవితా వైభవం


— డా॥ మిరియాల
రామకృష్ణ




గంగిశెట్టి లక్ష్మీనారాయణ

# శ్రీశ్రీ కవితా వైభవం

రచన

డా॥ మిరియాల రామకృష్ణ

ప్రచురణ



రిజిష్టర్డ్ నెం. 1/64

యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
5 కింగ్స్‌వే, సికిందరాబాదు - 3

**SRI SRI KAVITHA VAIBHAVAM**
Poetic Selections from Sri Sri's (Srirangam Srinivasa Rao) Works
By **Dr. Miriyala Ramakrishna**
M.A.,Ph.D.



యువభారతి

ప్రచురణ : 72

ప్రథమ ముద్రణ : 20 జనవరి 1981

ప్రతులు : 2,200

ముఖపత్ర రచన :
శీలా వీర్రాజు

ముద్రణ :
పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్,
హైదర్ గూడ, హైదరాబాదు

ముఖచిత్ర ముద్రణ :
రామా ప్రింటర్స్,
గాంధీభవన్, హైదరాబాదు

ప్రతులకు :

యువభారతి

5, కింగ్స్‌వే, సికింద్రాబాద్-5' 0003.

లేదా

యువభారతి కార్యాలయం
ఆంధ్ర సారస్వత పరిషత్ భవనములు,
తిలక్ రోడ్, హైదరాబాదు-500001.

వెల : రూ.



# యువభారతి పరిచయం

మనిషిలో అంతర్లీనంగా, నిక్షిప్తంగా ఉన్న ప్రతిభా పరిమళాలు పరివ్యాప్తం కాగలిగినప్పుడే అతని సృజనాత్మక శక్తికి సార్థక్యం చేకూరుతుంది. సమాజంలో సౌందర్యం, సౌజన్యం పెంపొందటానికి అనువైన వాతావరణం ఏర్పడుతుంది. పరస్పరావగాహనం జరుగుతుంది. నిర్మాణాత్మక దృక్పథాలకు ప్రాచుర్యం లభిస్తుంది. సమైక్యభావాలు కుదురుకుంటాయి.

యువభారతి కడచిన పదిహేడేళ్ళుగా సమాజంలో సామరస్యాన్ని పెంపొందించేందుకు సాహిత్యం కంటె ఇతరమైన సాత్త్విక సాధనం లేదనే విశ్వాసంతో ఇతోధిక కార్యక్రమాలను రూపొందించి కృషి చేస్తున్నది. సాధ్యమైనంత తక్కువ వెలకు వీలైనంత ఎక్కువ మందికి ఉత్తమ సాహిత్యాన్ని అందిస్తే సాహిత్యం పట్ల ప్రజానీకానికి అనురక్తి పెరుగుతుందనే నమ్మకంతో ప్రచురణ కార్యక్రమాన్ని చేపట్టింది. ఇంతవరకూ 72 ప్రచురణలను ప్రచురించి మూడు లక్షల ప్రతులకు పైగా సాధ్యమైనంత తక్కువ వెలకు తెలుగు పాఠకులకు అందించవూనుకొన్నది.

భారతదేశంలో ఎక్కడున్నా సరే యువభారతి నిర్వహిస్తున్న సాహిత్యోద్యమంలో పాలు పంచుకోగలిగేందుకు ప్రారంభింపబడిన సాహితీ మిత్రపథకంలో దాదాపు 6500 మంది సహృదయులు చేరి ప్రణాళికను విజయవంతం చేశారు. యువభారతి భవిష్య నిర్మాణంలో సహకరించేందుకు ఆరంభింపబడిన సభ్యత్వ పథకాలలో భారతీమిత్రులుగా దాదాపు 725 మంది, భారతీభూషణులుగా 70 మంది చేరారు.

ఉడుతాభక్తితో మేము చేస్తున్న భాషాసేవకు అండదండలుగా నిలిచారు ప్రజలు. వారి సౌహార్దం, భాషా ప్రియత్వం ఇవే మా పెట్టుబడి. మా తపస్సు ఫలించి తెలుగు దేశంలో అధ్యయన శీలతా, సౌజన్యం పెంపొందాలని ఆకాంక్షిస్తున్నాం.

సహృదయుల సహకారాన్ని అర్థిస్తూ

హైదరాబాదు
20 జనవరి 1981.

ఇరివెంటి కృష్ణమూర్తి

అధ్యక్షుడు : యువభారతి.




# మామాట

శ్రీశ్రీ ప్రతిభామూర్తి. ప్రాచ్య పాశ్చాత్య సాహిత్య మర్యాదల రహస్యాలను ఆకళించుకున్న వ్యుత్పన్నుడు. అందని ఊహలను అందించ గలిగే పదజాలాన్ని, పలుపోకడలు పోగల అర్థశక్తిని కైవసం చేసుకున్న రసజ్ఞుడు. అనుకరణం, ప్రతిధ్వననం అసలైన కవితాలక్షణాలు కావని తన కవితల ద్వారా ఉద్ఘోషించి, ''అనితరసాధ్యం నా మార్గం'' అని ప్రక టించుకోగలిగిన స్వతంత్రుడు. నిత్య ప్రయోగశీలిగా, నవమార్గ ప్రవర్తకు డుగా సాహిత్య చరిత్రలో స్థానం సంపాదించుకున్నాడు. కొత్త తీరులో అభివ్యక్తీకరణం చేసి, కొత్త తరహా కవిత్వానికి శ్రీకారం చుట్టినవాడు. వాస్తవ జగద్దర్శనాన్ని కవిత్వాదర్శంగా విశ్వసించినవాడు. శ్రీశ్రీని చదువనివాడు కడచిన యాభై యేండ్ల తెలుగు కవితా స్వరూపాన్ని చూడని వాడే. వ్యుత్పన్నుని ప్రతిభ ''కదిలేది-కదిలించేది'' అని నిరూపించిన నవకవితాభినేత శ్రీశ్రీ.

శ్రీశ్రీ కవితల్లో కొన్నిటిని ఏరి వాటికి సురుచిర వ్యాఖ్యానం సమకూర్చి 'శ్రీశ్రీ కవితావైభవం'గా మా 'యువభారతి' పక్షాన ప్రచురిస్తు న్నారు డా. మిరియాల రామకృష్ణ. శ్రీరామకృష్ణగారు శ్రీశ్రీ కవితపై పరిశోధన చేసి ఆంధ్ర విశ్వవిద్యాలయంనుంచి డాక్టరేటు పట్టా సంపా దించిన వారు. సహృదయ విమర్శకులు. అధ్యయన శీలురైన కవులు. బాల సాహిత్యాన్ని సృష్టిస్తున్న నవనీత మనస్కులు 1972లో మేము ప్రచురించిన 'మహతి'కి తమ వ్యాసాన్ని అందించి సహకరించిన సాహితీ సుహృన్మణులు. మా 'యువభారతి' నిర్వహిస్తున్న సాహిత్యోద్యమాన్ని ప్రోత్సహిస్తున్న భాషా బంధువులు. ఈ పుస్తకాన్ని మాకు వ్రాసి ఇచ్చి మాకు తోడ్పడిన డా. మిరియాల రామకృష్ణ సాహిత్య ప్రణయానికి మాకృతజ్ఞతా పూర్వకమైన అభివందనాలు.

ఇరివెంటి కృష్ణమూర్తి

అధ్యక్షుడు : యువభారతి



# వికసించిన విద్యుత్తేజం

ఆంధ్ర సాహిత్య చరిత్రలో అభ్యుదయ కవితా మహాప్రస్థాన యుగకర్త శ్రీశ్రీ. దాదాపు 1930 నుంచీ ఆంధ్ర సాహిత్యం ఆయన వెంట నడుస్తోంది. ఆయన పాట, ఆయన మాట, ఆయన ప్రక్రియ, ఆయన ప్రబోధం యువతరానికి విప్లవశంఖారావం వినిపించింది. కార్మిక కల్యాణానికి, శ్రామిక శ్రేయస్సుకు విశ్వజనీన విజయ మార్గాన్ని చూపించింది.

ఆంధ్ర సాహిత్యానికి సామాజిక స్పృహతో పాటు అంతర్జాతీయ దృక్పథాన్ని నేర్పారు శ్రీశ్రీ. సమాజ పురోగతికి సమరగీతం వినిపించారు. మరోప్రపంచం వారి మాత్రాఛందస్సులో గోచరించింది. 'అగ్నికిరీటపు ధగధగలు, ఎర్రబావుటా నిగనిగలు, హోమజ్వాలల ధగధగలు' శ్రీశ్రీ కవితలో కణకణ మండే నిప్పుల్లా కళ్లు మిరమిట్లు కొల్పించాయి.

"ఏ దేశ చరిత్ర చూచినా
ఏమున్నది గర్వకారణం
నరజాతి చరిత్ర సమస్తం
పరపీడన పరాయణత్వం"

అన్న శ్రీశ్రీ గేయం అభ్యుదయ కవికుమారుల కావ్యగీతాలకు పల్లవిగా పరిఢవిల్లింది. 'ఇతిహాసపు చీకటి కోణం అట్టడుగున పడి కన్పించని కథలన్నీ' ఈ యుగకవితకు వస్తుసంభారాన్ని కల్పించి పెట్టాయి. 'తాజ్ మహల్ నిర్మాణానికి రాళ్లెత్తిన కూలీ లెవ్వా' రనే ప్రశ్న జాతి చరిత్రను ఎక్స్‌రే కళ్లతో చదివింపజేసింది. పల్లకీమోసిన బోయీల వేడి నిట్టూర్పుల నిప్పుగాలి సామ్రాజ్యవాదపు నిలువుదోపిడీ విధానాన్ని నిలువునా కాల్చేయసాగింది

నవకవనానికి పెను నిద్దుర వదలించే గర్జ శ్రీశ్రీ కవిత. కదులుతూ కదిలించేదీ, మారుతూ మార్పించేదీ, పాడుతూ పాడించేదీ, పరిపూర్ణపు బ్రతుకిచ్చేదీ శ్రీశ్రీ నవకవనం. పులిచంపిన లేడినెత్తురు దానికి అంగరాగం. 'నేనొక దుర్గం, నాదొక స్వర్గం, అనర్గళం, అనితరసాధ్యం నా మార్గం' అన్న శ్రీశ్రీ వాక్కు శిలాక్షరంగా నిలిచే వాఙ్మయ సత్యం!

శ్రీశ్రీ పాట కవోష్ణరుధిరజ్వాల! శ్రీశ్రీ వచనకవిత ఉత్తేజాన్ని ఊపిరిగా పీల్చే వజ్రాయుధ ధార! శ్రీశ్రీ వచనరచన గుండెను గుప్పిట పట్టిన గద్య ప్రహేళిక! శ్రీశ్రీ నాటిక సూటిగా మాట్లాడే జీవిత వేదిక! శ్రీశ్రీ కథ జీవనవ్యథను మోసుకొని వచ్చే ఉదధితరంగం. శ్రీశ్రీ సినీగీత

జీవితక్షీరాన్ని పొంగించే జ్వాలానవత. శ్రీశ్రీ రక్తం కవిత, శ్రీశ్రీ ఊపిరి నవత, శ్రీశ్రీ ఆర్తి అభ్యుదయం; శ్రీశ్రీ విక్రాంతి విప్లవం!

సింబాలిజం శ్రీశ్రీ కవితలో శిల్పాన్ని మలచింది; సర్రియలిజం ఆయన సూక్తుల్లో వక్రతను చిత్రించింది; మార్క్సిజం ఆయన కవితకు శ్రీశ్రీ మార్కును బహూకరించింది.

శ్రీరంగం శ్రీనివాసరావు రెండు శ్రీకారాలకు ప్రతీక. ఒక శ్రీకారం అభ్యుదయ ప్రస్థానానిది; మరో శ్రీకారం విప్లవ ప్రస్థానానిది. ఆధునిక సాహిత్య జగత్తులో ఒక అర్థశతాబ్ది నాయకత్వాన్ని నిర్వహించి మరో అర్థశతాబ్దికి ఆకృతి నిర్మిస్తున్న శ్రీశ్రీ మహాకవియే కాదు, వాస్తవమైన మరో మహాప్రపంచం!

డా. మిరియాల రామకృష్ణగారు కవులు, విమర్శకులు. విశేషించి శ్రీశ్రీ కవితపై సిద్ధాంత వ్యాసం వ్రాసి డాక్టరేట్ పట్టం పొందినవారు. ఆయన ఆ మహాకవి కవితావైభవాన్ని వివేచించటంలో ప్రామాణికులని పించుకొన్నారు. వారి గ్రంథానికి ''వికసించిన విద్యుత్తేజం'' అని పేరు పెట్టారు. ''భావకవిత్వానికి భరత వాక్యం పలికి-అభ్యుదయ కవిత్వానికి ఆవాహనచేసి, అధివాస్తవిక కవిత్వానికి ఆలాపన పాడి-విదూషక వికట కవిత్వానికి ప్రాణంపోసి-విప్లవ కవిత్వాన్ని వీధి కెక్కించిన ఈ శతాబ్ది కవి వాక్కుకు పరిచయాత్మక వ్యాఖ్యానం''గా ఈ కవితా వైభవాన్ని తీర్చిదిద్దారు. **1925** నుండి శ్రీశ్రీ కవితలో క్రమంగా విస్తరిల్లిన అభ్యుదయ పథాల సాహిత్య విద్యుద్వైఖరిని మిరియాలవారు ఆసక్తిదాయకంగా, సప్రమాణంగా ప్రతిపాదించారు. శ్రీశ్రీ కవితా వ్యాఖ్యానానికి మరో ప్రస్థానం సారించారు. డా॥ రామకృష్ణగారి వివేచనాశక్తికి కావ్యఖండాల ఎంపిక, విమర్శనాశక్తికి వాటికి పొందుపరచిన వ్యాఖ్యానం ఉజ్జ్వలోదాహరణాలు. కాలక్రమంగా సూచించిన కావ్యఖండాలలో శ్రీశ్రీ ప్రతిభ బీజప్రాయంగా మొదలై ఒక మహా దర్శనాన్ని ఎలా సాధించిందో, ప్రభావాల పరిధులను దాటి ప్రత్యేక ప్రతిపత్తిని ఎలా పొందిందో, సరళ సుందరంగా, శక్తిమంతంగా విశ్లేషించి చూపించారు డా॥ మిరియాల రామకృష్ణ.

శ్రీశ్రీ కవితా ప్రస్థానాన్ని పరిశీలింపదలచుకొన్న సహృదయులకు ఈ వ్యాఖ్య ఒక చేతిదివ్వె. దివ్వె చిన్నదైనా దేదీప్యమానమైన వెలుగు. ఆ వెలుగును అక్షరాకృతిగా నిల్పిన మిత్రులు డా॥ మిరియాల రామకృష్ణగారికి, దీనిని ప్రచురిస్తున్న యువభారతి వారికి అభినందనలు!

జి. వి. సుబ్రహ్మణ్యం
ప్రధాన సంపాదకులు.

హైదరాబాదు
20-1-1981

# విషయసూచిక

51. సిరిసిరిమువ్వ శతకం
52. ,, ,,
53. కుక్కుటేశ్వర శతకం
54. మహా సంకల్పం
55. ఎఏఐ ఒఓఔ
56. మేమే
57. సదసత్సంశయం
58. ఒకటీ-పదీ
59. శరచ్చంద్రిక
60. ప్రాసక్రీడలు
61. లిమరుక్కులు
62. ఖడ్గసృష్టి
63. ఝుంఝు

*

"ఇదేమిటి
ఈ మూల స్త్రీలకోసం ఇట్లా మూలుగుతున్నారు ?
శ్రీశ్రీ పద్యాల వేగంతో
ప్రపంచపు పాత దుమారమంతా
వూడ్చుకు పోతో వుంటే !

హృదయాల మీది పెంకులు
పగిలిపోతున్నాయి,
బైట వినబడుతున్నాయి
ఇట్లా రండి,
రోడ్డు మీదకి !''

-రుక్మిణీనాథశాస్త్రి
చెలంతో (1940)

*

గంగిశెట్టి లక్ష్మీనారాయణ

# శ్రీశ్రీ కవితా వైభవం

1. ఓ మహాత్మ ! త్వదీయ మహోన్నత ప్ర
భావమింతని తెలుప నెవ్వాని తరము ?
..............................
దివ్యలోచనములఁ బ్రసాదింపుమయ్య ! (1925)

మనకు దొరుకుతున్నవాటిలో శ్రీ శ్రీ (శ్రీరంగం శ్రీనివాసరావు) రచించిన మొట్టమొదటి పద్యం ఇది. ఇది రచించేనాటికి అతనికి 15 ఏళ్లు. అంతకు ముందే రచించిన కందపద్యంకానీ వీరసింహ విజయసింహులు అనే నవలకానీ సావిత్రీ సత్యవంతము అనే పద్యనాటకంకానీ కాగితం పడవల్లా కాలంలో కలిసిపోయాయి. విశ్వరూప సందర్శనము (దివ్యలోచనములు) అనే ఖండికలోవి పై మూడు పాదాలు. ధృతరాష్ట్రుడు విశ్వరూపం ధరించిన శ్రీ కృష్ణుడ్ని అడుగుతున్నాడు తనకి కళ్లిమ్మని. అదీ సందర్భం. ధృతరాష్ట్రుడి మాటల్లో శ్రీనివాసరావు ఆర్తి కనిపిస్తోంది. ఈ దివ్యలోచనం అతడికి కావలసిన కవితాప్రతిభయే. "కళ్లుంటూ ఉంటే చూసి, వాక్కుంటే వ్రాసీ!" అని కవులందరికీ శ్రీ శ్రీ చెబుతాడు. కళ్లు వచ్చాకానే "చిత్రవిచిత్ర శ్యమంత రోచిస్స్నివహం" చూడగలిగాడు శ్రీ శ్రీ. కవితా "విశ్వరూప సాక్షాత్కారం" తనకు కలిగిందని శ్రీ శ్రీ తన 27 వ ఏట చెప్పుకోగలిగాడు. ఈ 12 ఏళ్ల పాటు 'చిరదీక్షా శిక్షాతపస్సమీక్షణ'లో ఉన్నాడు. తరువాతనే సమాజవాస్తవాలు కన్నాడు. శంఖారావం, ఢంకాధ్వానం విన్నాడు.

2. ధైర్యము త్యజించి ఘోర యుద్ధంబు సేయ
ననుచిత పలాయన పథంబు ననుసరించి
ఓ సుయోధన ! యెందేగి యుంటివిపుడు
రమ్ము ! క్షత్రియోచిత సంగరం బొనర్ప (1926)

మడుగులో దాక్కున్న దుర్యోధనుడికి ధర్మరాజు 'సమరాహ్వానము' చెబుతున్నాడిక్కడ. మహాభారతగాథ ఆనాడే ఆకర్షించింది శ్రీశ్రీని. సత్య సందర్శనంపట్ల ఉత్కంఠ, ధర్మ సంగ్రామంపట్ల అభిమానం చిన్నప్పటినుంచీ

ఉన్నవాడు కనకనే అనతి కాలంలోనే గతితార్కిక భౌతికవాదం శ్రీశ్రీకి ఒంట బట్టింది. పీడక పీడిత వర్గాలలో పీడితవర్గంపట్ల పక్షపాతం పెంచుకొని 'కదన శంఖం' పూరిస్తున్నా నన్నాడు. విప్లవశంఖం పూరించమన్నాడు. ఈ ప్రపంచ మొక పద్మవ్యూహం అన్నాడు. మరోప్రపంచానికి ధనంజయునిలా మహా ప్రస్థానం సాగించాలన్నాడు. జగమంతా బలివితర్ది అన్నాడు. మరణించిన యువయోధుల్ని చూపించాడు. కురుక్షేత్రమున క్రుద్ధవృకోదరు గదాఘాతం జ్ఞాపకం చేశాడు. మోసాలనూ, దౌర్జన్యాలనూ ఈసడించాడు. ఏ యుద్ధం ఎందుకు జరిగిందో తెలుసుకొమ్మన్నాడు. సంగ్రామం మాయంటావా? అని మాయావాదిని సవాలు చేశాడు. ధర్మస్థాపనకు యుద్ధంచేసే వాడా అని మానవుడ్ని అభినందించాడు. జర్మనీ మీద రష్యాను గర్జించ మన్నాడు.

యౌవనంలోనే కాదు, షష్టిపూర్తి అయిన తరువాత కూడా ''ఊరుకుంటానా నేను కసిగా కసాయిగా ఉపద్రవంలాగ ఉద్వేగంగా లేచి సంహారాన్ని స్యందనం చేసి ఉద్రేక తరంగాలే తురంగాలుగా ఆగ్రహం కొరడాని చేబూని సాయుధ విప్లవ బీభత్సుని సారథినై భారత కురుక్షేత్రంలో నవయుగ భగవద్గీతా ఝుంఝుని ప్రసరిస్తాను'' అన్నాడు శ్రీశ్రీ. (1970).

'సమరాహ్వానము' 1926 నవంబరు భారతిలో ముద్రితమయింది. అందులో నాటకీయ శైలీ, పదాల పొందిక, భాషావేగం, పద్యరచనా కౌశలం కనిపిస్తాయి. తేటగీతి మాలికలు గ్రుచ్చి, సామెతలూ జాతీయాలూ తెచ్చి నడిపించిన ఖండిక యిది. ఇందులో మహాభారత గాథ అంతా ప్రసక్తమవుతుంది. ధర్మమే జయమను మాట సుయోధనుడు మరచిపోయాడని వెక్కిరింప బడ్డాడు. ఆధునిక యుగంలో ధర్మాన్ని మరచినవారు బూర్జువాలు, సామ్రాజ్య వాదులు, ఫాసిస్టులు. వారినే వెక్కిరిస్తాడు శ్రీశ్రీ.

3. *అయిన నేమాయె ప్రేమ మెంతైనఁ జేయు*
*దుర్గమ భయంకరారణ్య దుర్గములును*
*ప్రళయకాల సమాన విభావరులును*
*ప్రణయరాజ్యరమా ప్రాణపతి కొఱకయి*
*తరలియరిగెదు నా కవాంతరములగునే* (1927)

తన ప్రియుడ్ని కలుసుకోవడానికి అభిసారిక ఒక కాళరాత్రిలో గాలి వానలో ఏకాంతంగా బయలుదేరుతుంది. ఆమె సంకేత స్థలం ఒక దుర్గమారణ్యం.

శ్రీశ్రీ లాగే శ్రీశ్రీ సృష్టించిన అభిసారిక కూడా సాహసి. ఈమె విషయ వాంఛలకోసం వెడుతున్నట్లు కనిపించదు. ఈ జీవితాన్నీ ఈ ప్రపంచాన్నీ విడిచి భక్తుడు పరమేశ్వరాభిముఖంగా సాగిపోవడమే అభిసరించడం. అడవులు, చీకటి రాత్రులు ఆమెకు అవాంతరాలు కానేకాదట ! ''నదీ నదాలూ అడవులు కొండలు ఎడారులా మనకడ్డంకి ?'' అని పీడిత నాయకుడై శ్రీశ్రీ అన్న మాటలు జ్ఞాపకం వస్తాయి ఈ పద్యం చదువుతూంటే.

అభిసారిక శ్రీశ్రీయే. అతని మార్గం అనర్గళం అనితర సాధ్యం అయింది. చిన్నప్పటి ప్రణయరాజ్యమే భౌతిక దృష్టి కలిగే నాటికి మరో ప్రపంచం అయింది.

*4. సాయం ప్రస్ఫుట రాగరంజిత లసత్సంపూర్ణ*
*సౌందర్యరాశీయుక్తామల దివ్యమూర్తివయి*
*సాక్షీభూత నానామరుత్తోయస్తోత్ర*
*గభీర గానరస సంతుష్టాంతరంగంబునన్*
*మాయామేయ జగద్వినాశన మతిన్*
*నర్తింపుమా శంకరా !* (1927)

ఈ శార్దూలవృత్తం 'ప్రళయ నర్తనము' లోది. ఈ లోకమంతటినీ మూడవకంటితో తగులబెట్టి శివుడు నర్తించాలట ! తాండవం చేసే సమయంతో పాటు శంకరుడు కూడా అరుణరాగరంజితుడై సాక్షాత్కరించాలట ! ఎరుపు మీద అంత అభిమానం ఆనాటినుంచే శ్రీశ్రీకి. స్తోత్రపరులయి దేవతలంతా నిలబడి చూస్తూ ఉండగా పరమానందంతో చేయవలసిన శివనర్తనానికి 'మాయామేయ జగద్వినాశనం' పరమావధిగా భావించడమే విచిత్రమైన విషయం.

మహాప్రస్థానగీతాలు పూర్తి అయ్యేదాకా శ్రీశ్రీకి 'శివుడు' అభిమాన కావ్య సామగ్రియే ! 'ఆ హరునిటలమందు దాగి యడగిన అగ్నిహోత్రమును నేను' అని ప్రకటించాడు ఒకచోట. హరోం హరోం హరహర హరహర హర అని కదలండని పీడితులకు ప్రబోధించాడు. రుద్రాలి నయన జ్వాలిక నవకవనానికి కావాలన్నాడు. నటధూర్జటి నిటాలాక్షి పగిలిందని రెండవ ప్రపంచయుద్ధాన్ని ఉత్ప్రేక్షించాడు.

భావకవులు కృష్ణుడ్ని తమ కావ్య నాయకుడుగా తీసుకుని కాల్పనిక భావాలను విరజిమ్మారు. అది భోగైక మనస్తత్వం. శ్రీశ్రీ శివుడ్ని కావ్య నాయకుడిగా తీసుకుని ఈ పాత ప్రపంచాన్ని తగలబెటమంటాడు.

ఆరభటీ వృత్తి కనుగుణంగా గౌడీ రీతినీ ఓ జోగుణాన్నీ కలిపిన భాషను వాడటంలో ప్రబంధ సంప్రదాయాన్ని శ్రీశ్రీ ఆనాడే అనుసరించాడు.

*5.* *ఈదుకొనిపోతి మామక హృదయకుహర*
*జనిత భావ నౌకాధిరోహణ మొనర్చి*
*కంధర తరంగ నివహ సంకలిత మహిత*
*గగనసాగర గంభీర గర్భమందు.* *(1927)*

నిరంతరం స్వప్నసీమల్లో తేలియాడే భావకవిగా శ్రీశ్రీ ఈ పద్యంలో కనిపిస్తాడు. 'రజనీగానము'లోని కొసమెరుపీ తేట గీతం.

జీవితం లాంటి పూలతోటలో యౌవనం లాంటి శరద్రాతిలో కవిత్వం లాంటి భావావేశం పొంది గానస్రవంతిలో స్నానంచేస్తూ చందమామను చూచి నర్తిస్తూ భావనౌకలో మేఘతరంగాలు గల ఆకాశ సాగరంలో ప్రయాణం చేశాడట తాను! ఆ భావనౌక తన హృదయం లోనిదేనట! ఇలాంటి భావచిత్రాలు గీయడం 16 ఏట లభించిన కళావిశేషం.

విశేషణపరంపరా సంఘటన నైపుణ్యం, లలితపదవిన్యాస చాతుర్యం, భావాభివ్యంజక పద గమన సంయోజన చణత్వం పై పద్యంలో కనిపించే శిల్పవిశేషాలు.

కంధరతరంగ నివహసంకలితమహిత గగన-అన్నీ తలకట్లే! తరంగాలకు వ్యంజకత్వం కాబోలు !

*6.* *మహిత భవదీయ రూప సంపద్విలాస*
*నిర్మలాంచిత మందాకినీ తరంగ*
*సమవగాహనోపార్జిత విమల పుణ్య*
*మహిమకారణ గళిత కల్మషుడనైతి* *(1928)*

ఈ తేటగీతి 'ప్రభాతగానము' లోది భగవంతుడి రూపమందాకినీ తరంగాలలో తాను స్నానం చేశాడు. అందువల్ల కలిగిన పుణ్యం తన పాపాలను హరించిందట! ఇదీ అతని తృప్తి. ఈ పద్యమంతా ఏక సమాసమే! అది కూడా బహువ్రీహి! ఇలాటి బహువ్రీహి సమాసాలు 'ప్రభవ' లోని శైలిలో అనేకంగా కనిపిస్తాయి.

ఆ రోజులలో శ్రీశ్రీ ప్రహ్లాదుడి వంటి భక్తుడు. పోతనగారిలా తాను సృష్టించిన పాత్రలలో లీనమైపోతూ కనిపిస్తాడు. ఇందుకు 'మతస్వీకృతి'

ఖండికలోని యదునాథవసువు పాత్ర ఉదాహరణ. భయద విరహానల ప్రబల తీక్ష్ణతయందు జీవనంబె ఇంకిపోవునని భయమయ్యె ఓ ప్రేమవారాన్నిధీ-దీనునకు-నీ ప్రాపు జేకూర్పుమా!'' వంటి గేయాలున్నాయి. ఆ ఖండికలో భగవత్ సాక్షాత్కారం కోసం తహతహలాడిపోతాడు ఆ భక్తుడు! 'అంతిమ యాత్ర' అనే మరో ఖండికలో పరలోకంలో భగవంతు డుంటాడని కవి నమ్మి నట్లు కన్పిస్తుంది.

ఈ భగవద్విశ్వాసం శ్రీశ్రీ లో ఎంతో కాలం నిల్వలేదు. అది 'సన సత్సంశయం'గా మారింది. ఒక సకలాతీతశక్తి ఉన్నట్టా లేనట్టా? జగదీశ్వరు డెవరో ఆగుపడితే బాగుండును, ఏమీ యిది స్వామీ అని నిలవేస్తా కడిగేస్తా అంటూ తిరగబడ్డాడు. మహాప్రస్థానంలోనే జగత్తు మిథ్య బ్రహ్మ సత్యం అనే వాదంమీద తిరుగుబాటు చేశాడు. మానవుడే దేవుడు శ్రీశ్రీకి. మానవుడే దేవుణ్ని నిర్మించాడు! ఇద్దీ భౌతికవాది అవగాహన!

7. *గాలి యొసఁగెడు క్రొత్త తెక్కల ధరించి*
*అతి నిరాఘాటముగ విహాయస పథాల*
*నెఱక పడరాని యెచటికో ఎగసిపోదు!* (1928)

'స్వేచ్ఛ' అనే ఖండికలోని పద్య పాదాలివి. తానొక పెద్దచెట్టుకి ఆకుగా మారిపోవాలట! తనకు రెక్కలు రావాలట! ఇలాంటి స్వేచ్ఛను కోరుకున్నాడు.

కృష్ణశాస్త్రి వ్యక్తివాదానికిది ప్రతిబింబమే! ఆకులో ఆకునై పోతాననీ జగమునిండ స్వేచ్ఛాగానఝరుల నింతుననీ అలరునయ్యెదఁ జిగురాకు నయ్యెద ననీ (సమీరంతో) 'నీదు నునులేత తెక్కలమీద వడిగ నెత్తుకొని పోవరాదె నన్నెచటికేని' అనీ కృష్ణశాస్త్రిగారి పలుకులు! వీటికి ప్రేరణ ఆ భావాలే.

ఈ వ్యక్తి స్వేచ్ఛాభావమే శ్రీశ్రీలో మారాకు తొడిగి సమాజ స్వేచ్ఛ అయింది.

నేను సైతం భువన 'భవనపు బావుటానై పైకిలేస్తాను అనేమాట కార్మికుడం టాడు.' పోదాం పోదాం పైపైకి' అనే మాట విప్లవ నాయకు డంటాడు. 'నిప్పులు చిమ్ముకుంటూ నింగికి నేనెగిరిపోతే' అని తన అభ్యుదయాన్ని గురించి శ్రామికు డంటాడు.

వ్యక్తి స్వేచ్ఛ బూర్జువా లక్షణం! సమాజ పురోగమనానికి ప్రత్యేక వ్యక్తి అడ్డు రావడానికి వీలులేదు. కార్మికవర్గం సమాజానికంతకీ సమాన

స్వేచ్ఛను పంచిపెడుతుంది. అందుకే శ్రీశ్రీ ఆత్మాశ్రయ బహువచన కవిత్వం రాశాడు మహాప్రస్థానంలో. ఏకవచనం ఉన్నచోట సమష్టికి ప్రతినిధి అయ్యాడు.

8. *సురుచిర రూపసంపదల సొంపులొసంగి*
*యొసంగఁడయ్యె మాధురిఁ జిలికించు సుస్వరము*
*ధూర్తుఁడు దేవుఁడటంచు నెంచరా*
*దరయఁగ సర్వోనిష్ఠె కననౌను*
*గుణమ్మొట నున్న నచ్చటన్ బరగెడు దుర్గుణంబు*
*గుణ మాత్రమే మెత్తురు మానవోత్తముల్* (1928)

ఈ చంపకమాల పద్యం 'మయూర నర్తనము' లోది. నెమలి రూపాన్నీ నాట్యాన్నీ చూసి ఆనందించేవారే దాని కంఠధ్వని కఠోరత్వం విని అసహ్యించుకుంటారు. దీనికి కారణం వారి అల్పత్వమే. గుణదోషాలు రెండూ ఉండటం ప్రకృతిసహజం అనీ గుణమే మెచ్చుకుని దోషం విడిచి పెట్టడం ఉత్తమలక్షణం అనీ కవి సమాధానం. నెమలి దోషానికి కారణం దైవసృష్టియే అయినా దైవనింద పనికి రాదట! ఇంతటి సాత్వికదృక్పథం-ఆనాటిది.

కానీ ఈ దృక్పథం గతితార్కిక భౌతికవాదంతో తారుమారయిపోయింది. దోష విమర్శ చేయనిదే ఈ లోకం ముందుకు నడవదని నిశ్చయించుకున్న తరవాతనే సిరిసిరిమువ్వ శతకంలోనూ లిమఋక్కులు లోనూ పరిహాస కవితలు ఎన్నో రాశాడు శ్రీశ్రీ.

9. *ఎఱుఁగవే నన్ను లోక భీకర మహోగ్ర*
*ఫణివిషస్ఫీత మృత్యురూపిణిగ నీవు?*
*నీ హృదంతర సదన సంస్థిత కరాళ*
*శిఖిశిఖాచ్ఛటనని గ్రహించెదవొ లేవొ?*
*భీప్రద క్రకచోగ్ర దంష్ట్రా ప్రభూత*
*విస్ఫుర త్తేజమునఁ దాండవించు నన్ను*
*మృత్యు దేవతగా మది నెఱుఁగ లేవొ?* (1928)

ఈ తేటగీతిమాలిక 'మృత్యుప్రబోధము' లోది. మృత్యువు మానవుడితో మాట్లాడటానికి వచ్చిందట. అతణ్ని హెచ్చరిస్తోంది— తన భయంకర రూపాన్ని తెలుసుకోమంటోంది. ఎరుగవా నన్ను నాగుబాము విషంతో ప్రకాశిస్తాను నేను; గ్రహిస్తావా లేదా నన్ను నీ హృదయంలోనే నివసించే అగ్ని

జ్వాలను నేను, తెలుసా లేదా నీకు రంపాలవంటి కోరల కాంతులతో తాండ విస్తాను నేను! మృత్యుదేవతని నేను!

శాబ్దికమృదంగం ద్వారా మృత్యుభీతిని కళ్ళకు కట్టించాడు ఇక్కడ శ్రీశ్రీ. ఫణివిషస్ఫీత, శిఖిశిఖాచ్ఛట, క్రకచోగ్రదంష్ట్రి వంటి పదబంధాల నుచ్చరించడమే ఒక భయంకరానుభవం. కృష్ణశాస్త్రిలా "వికృతక్రూరక్షుధా క్షుభిత మృత్యుకఠోర వికట పాండుర శుష్కవదన దంష్ట్రాగ్నిలో నవ్వేలా ?" వంటి ప్రౌఢత్వం సాధించడం ఆ రోజుల్లో గొప్ప. అసలు వాక్యాలు కూడా కృష్ణశాస్త్రి నమూనాలే. 'ఎవ్వరని యెంతురో నన్ను ఏననంతశోక భీకర తిమిరలోకైకపతిని' అనే ఎత్తుగడలోంచే 'ఎఱుఁగవే నన్ను లోక భీకర మనోగ్రఫణివిషస్ఫీత మృత్యురూపిణిగ నీవు' అనే బాణీ పుట్టింది.

మృత్యువుయొక్క కాల్పనిక రూపాన్ని ఆత్మాశ్రయ పద్ధతిలో సావేశంగా చెప్పడం ఆనాటి శ్రీశ్రీ అమృతదర్శనానికి నిదర్శనం. తానే మృత్యువుగా తానే సముద్రుడుగా మారిపోయినట్లు భావించుకుని ఖండికలు రాశాడు శ్రీశ్రీ. రాను రాను మృత్యువు సమాజంలో ఆకలిమంటల వల్ల వస్తున్నదని గ్రహించి భిక్షు వర్షీయసి, బాటసారి, ఆకాశదీపం వంటివి రాశాడు.

*10. ఒక యనిర్వచనీయ మహోన్నతమగు*
*హాయి యున్నది గీత పద్యముల యందు*
*దరులొరని పారు గాంగ నిర్ఝరిణి కరణి*
*చెంగుచెంగున గీతి తురంగలించు !* (1928)

'గీతపద్యాలు' అనే ఖండిక నుంచి ఈ గీతపద్యం. తేటగీతి పద్యాలంటే ఆ రోజుల్లో తనకెంతో ఇష్టం. ఎంత ఇష్టమో చెప్పడానికి ఒక కవితనే రాసి చూపించాడు. తేటగీతులను గురించే-అదీ తేటగీతులలోనే.

తేటగీతుల్లో ఉన్న హాయి మహోన్నతం- అనిర్వచనీయం! గట్లమధ్య పారే గంగానదిలా ప్రవహిస్తుందట తేటగీతి! అందులో స్వేచ్ఛ ఉంది; నియతి ఉంది. కనుక ఆనందం ఉంది, అందం ఉంది. స్వైరవిహారం లేదు.

పద్యంలోని భావంమీద ఆనందం ఆధారపడి ఉంటుంది. ఛందోగతలయ మీద మాత్రమేకాదు. కానీ భావమెంత అధమంగా ఉన్నా పద్యరచనే ఆ రసా నందాన్ని కలిగించగలదని శ్రీశ్రీ తలపోస్తున్న తొలిరోజులవి. ఏ రసభావాని కైనా గీతపద్యం అనువైన ఆకారం కలిగించగలదని ఆనాటి అవగాహన,

శార్దూల మత్తేభాదులు శృంగారోచితాలు కాకపోవచ్చు, గాని తేటగీతి అన్ని రసాలకూ పనికి వచ్చే గతిభేదాలను సంతరించుకోగల్గుతుంది. అది శ్రీశ్రీ దృష్టిలో Semi-elastic metre.

ప్రాసనియమం లేని తేటగీతికి సూర్య చంద్ర గణాలు స్వేచ్ఛనూ గతి భేదాలనూ గీతిమాధురినీ కలిగిస్తాయి. వీటితోపాటు చలనమూ వేగమూ కూడా వస్తాయి. శ్రీశ్రీ తేటగీతుల్లో ముత్యాలసరం వచ్చి తూగుతుంటూ ఉంటుంది. 'హాయి యున్నది గీతపద్యము' అన్నది ముత్యాల సరం పాదమే!

'ప్రభవ'లోని ఖండికలు పెక్కు తేటగీతులే. తరువాత శ్రీ శ్రీ అభ్యాసం వృత్తాలవైపు మళ్లింది. తేటగీతుల మీది ఈ మోజు తాత్కాలికం' 'ఛందస్సును లొంగించుకుని దానిచేత చిత్రవిచిత్ర రీతులలో కదం త్రొక్కించడం'మహా ప్రస్థానం నుంచి ఆరంభమయింది. ఛందస్సుమీద ప్రత్యేకంగా ఉన్న ఆసక్తి నూతన ఛందస్సుల సృష్టికి శక్తిగా పరిణమించింది. ఛందస్సుల సర్వపరిష్వంగా లను వదలి మాట అతనికి బానిసలయ్యాయి.

11. ఆ ప్రసన్న ప్రశాంత దినాగమమున
ఆ మనోహర భావగీతామృతముల
తీయదనమున భాగీరథీమనోజ్ఞ
వీచికాసంతతులు తలలూచి మెచ్చె
తన్మయానందరస మహోత్సాహి యగుచు
మాధురీ మౌగ్ధ్యమున యదునాథ వసువు
ప్రార్థనాత్మక గీతముల్పాడు వేళ
బుష్ప సంతతు లానందమున హసించె
ఆ వినిర్మల శాంతగీతావిరావ
మాలకించి యనంత హర్షాప్తి నొంది
పరిసర స్థిత భూరుహ పత్రవితతి
సాంద్ర నీహార హర్ష బాష్పముల రాల్చె!

ఈ మూడు తేటగీతులూ 'మతస్వీకృతి' అనే కవితాకథానికలోని సందరోద్దీపకమైన ప్రకృతి వర్ణన చిత్రాలు.

గంగానదీ తీర పర్ణశాలలో నివసించే యదునాథవసువు భక్తిబంధుర భావగీతాలు పాడుకున్న సందర్భంలోది ఈ వర్ణన.

యదునాథుడు భావగీతాలు పాడాడు. **అవి సుధామధురాలు. వాటిని** ఆస్వాదించేది గంగానదియే ! తన తరంగాల **తలలూపి** మెచ్చుకుంది **గంగానది** ఆ తీయదనాన్ని ! గంగానది ఎంత తీయనిదో ? **ఇంకా** తీయనిది **ఆతనిపాట!** ప్రకృతికి చేతనత్వం కల్పించి కథానన్నివేశాలపట్ల, పాత్రల పట్ల ప్రకృతి పొందిన అనుభూతుల్ని వర్ణించడం మహాకవి శిల్పం. తలలూపి మెచ్చడం మానవానుభూతి. దాన్ని తరంగాలకు కల్పించడంవైచిత్రి.

యదునాథుడు ప్రార్థనగీతాలు పాడుతూంటే **పూలు** ఆనందంతో **వికసించి** నవ్వాయట. ఆతని శాంతగీతాలు విని చెట్ల **చివురాకులు** మంచుబొట్ల ఆనంద బాష్పాలు రాల్చాయట'.

ఈ అచేతన చేతనీకరణ శిల్పం శుద్ధమైనది. ఇది సాంఘిక **స్పృహతో** మహాప్రస్థానం నిండా అల్లుకుంది. ఎగిరి ఎగిరి **ఎగిరిపడుతున్నవి ఎనభై** లక్షల మేరువులు— తిరిగి తిరిగి తిరిగిసముద్రాల్ **జలప్రళయ** నాట్యం చేస్తున్నవి వంటివి ఉదాహరణీయాలు.

*12.* *నవవసంత ప్రాతరంచిత*
*భువన మోహన కుసుమవల్లరి*
*గ్రీష్మకాలాతప భరంబున*
*గిటుడంగినది !* ***1928***

వసంతంలో **పూలుపూసిన** తీగ గ్రీష్మంలో **ఎండిపోయింది ! ఈ** అప్రస్తుతం ప్రభవ 'అంకితం' లోని ముత్యాల సరం.

తన కన్నతల్లి అప్పుడు కొంత తనకు రెండేళ్లయినా నిండకుండానే చనిపోయింది. అప్పటినుంచీ తనను పెంచుతూవచ్చిన 'సుభద్రమ్మ' (పినతల్లి) తన 14వ ఏట మరణించింది. ఆమెకే తన **తొలికావ్యం** ప్రభవను **అంకితం చేశాడు** శ్రీశ్రీ. శ్రీశ్రీ రాసిన మొదటి ఎలిజీ 'అంకితం'.

**సుభద్రమ్మ** 'నవవసంత ప్రాతరంచిత **భువనమోహన** కుసుమ వల్లరి'. ఆమె 'గీష్మకాలాతపభరం' వల్ల మరణించింది. ఆ గ్రీష్మకాలం **మృత్యువే.** నవ వసంతం తానే. భువనం తన జీవితమే.

శ్రీశ్రీ రాసిన మొదటి ముత్యాలసరాలు **అంకితంలోవి.** గీతులూ **గేయాలూ** వృత్తాలూ ముత్యాలసరాలూ ప్రభవ ప్రచురించేనాటికే శ్రీశ్రీకి చేతికందాయి.

*13.* *ఆ సనాతన కాల ప్రభాసమేత*
*వేదభూసుర ఘోషానవీన గతుల(*

*బలుకు దెలియని తన్మయత్వమును గనిన*
*నా హృదంతరమునకు లీనత ఘటిల్లె* **1928**

'అహర్ముఖము' అనే ఖండికలోది ఈ తేటగీతి. పురాతన భారత దేశాన్ని కలగాంచి గతకాలం ఎంతో గొప్పదనుకుంటూ రాసిన కవిత ఇది. ఋష్యాశ్రమాలను మౌనిప్రకాండులను చూస్తాడు. ఋగ్వేద మంత్రాలను వింటాడు. వేద భూసురుల ఘోషల్లో నవీనగతులు అతడ్ని తన్మయపరుస్తాయి. ఆ పారవశ్యాన్ని వర్ణించుకున్నాడు.

జాతీయ పునరుజ్జీవనోద్యమం శ్రీశ్రీ మీద ప్రభావం ప్రసరించుతోంది. ప్రభాసమేత, ఘోషానవీన వంటి ప్రయోగాల్లో స్త్రీలింగ శబ్దాల మీది అభిమానం ఆ నాటి భావకవులదే!

**14.** *అప్పటి ధరారమణ గౌరవాతిశయము*
*ఆ దినమ్ముల సౌఖ్యానుమోదరక్తి*
*నాటి సంపత్సమృద్ధి యేనాటికైన*
*ఆంధ్ర నిర్భాగ్యధాత్రికి నలవడునొకొ* **1928**

'అంతస్సమాధి' అనే ఖండికను ఇలా ముగించాడు శ్రీశ్రీ. రాయల రాసిక్యాన్ని తిమ్మన వర్ణనద్వారా గ్రహించి పరవశుడై ఆ కాలంలోకి మనో వేగంతో వెళ్ళిపోతాడు. ఆ సభను కళ్ళారా చూసి వస్తాడు. తానిప్పు డుంటున్న ఆంధ్రదేశం నిరుపేదగా కనిపిస్తుంది. తిరిగి ఆ రాజు, ఆ సుఖం, ఆ సంపద వస్తే బాగుండు ననుకుంటాడు.

సమకాలంలోని సాహిత్య-రాజకీయ వాతావరణం గతంతో సరితూగలేవని విచారించాడు. రాయప్రోలు, విశ్వనాథ, కొడాలి ప్రభృతులు గతించిన ఆంధ్ర వైభవం గురించి ఆవేదన ప్రకటిస్తున్న రోజులవి. వారి ప్రభావాన్ని తప్పించు కోలేని ఆలోచనలివి.

చరిత్ర ఎప్పుడూ ముందుకే వెడుతుంది. గతం కన్నా భవిష్యత్తు ఉజ్జ్వ లంగా ఉంటుంది-అనే అభిప్రాయం మహాప్రస్థానం నాటికి కానీ కలగలేదు శ్రీశ్రీకి. అయితే గతం తిరిగిరాదని 'సుప్తాస్థికలు' నాటికే ధ్రువపరుచు కున్నాడు శ్రీశ్రీ.

మంచి గతమున కొంచెమేనోయ్ అన్న గురజాడ ప్రబోధం కూడా శ్రీశ్రీని ఇంకా ఆకర్షించలేదు. ఫ్యూడల్ వ్యవస్థలోంచి సమాజం బూర్జువా

వ్యవస్థలోకి పురోగమించిందని తెలుసుకున్న తర్వాత ఈ జాతీయవాదానికి స్వస్తి చెప్పాడు శ్రీశ్రీ.

15. *ఆ హరు నిటల మందు*
*దాగి యడఁగిన అగ్నిహోత్రమును నేను!* **1928**

మృత్యుకంఠాన్నీ సముద్ర కంఠాన్నీ అనుకరించిన శ్రీశ్రీ అగ్నికంఠాన్ని కూడా అరువు తెచ్చుకున్నాడు. శివుడి మూడోకంటిలోని అగ్నిహోత్రమట తాను! 'నట ధూర్జటి నిటాలాగ్ని' తానే! మాయామేయ జగద్వినాశనం చేయ వలసిందిగా శంకరుడ్ని మొట్టమొదటే ప్రార్థించిన విప్లవవాది, అరాజకవాది శ్రీశ్రీ. ఈ అరాజకవాదం ఆలోచనచేత శాశితయై పాతప్రపంచం నశిస్తేగానీ నూత్న ప్రపంచం అవతరించదనే భావాన్ని ఉద్దీపింపజేసింది. డాడాయిజం, ప్యూచరిజంల పట్ల ఆసక్తిని శ్రీశ్రీ కనబరచాడంటే సహజంగా అతనిలో పెల్లు బికే ఉద్రేకం, ఉన్మాదం అందుకు దోహదం చేశాయన్న మాట.

16. *నీవు నాటిన తోటలోపల*
*వేవ తరుగని పూవు గుత్తులు*
*నేటివరకును తేటవలపులు*
*నింపెడిని దెసల!* **1928**

పెద్దనగారి మనుచరిత్ర చదివి, ఆంధ్ర కవితాపితామహుడి కవితా శిల్పా నికి ఉబ్బి తబ్బిబ్బయిపోతూ ముత్యాల సరాలలో కవితాంజలి పట్టాడు శ్రీశ్రీ అందులోదే ఈ మచ్చుతునక.

పెద్దన కవిత్వం ఒక పూలతోట, ఆయనే దాన్ని నాటాడు. అందులో మనోహర భావాలు పూఁగుత్తుల వంటివి. అవి నేటికీ తేటవలపులను దెసలనిండా నింపుతున్నాయట!

ఈ ముత్యాలసరంలో ఒక్క తత్సమపదం కూడా లేకుండా జాగ్రత్త పడ్డాడు. యతి ప్రాసల స్వేచ్ఛతో గతివైచిత్రిని సాధించాడు.

మరో మహాకవికి కవితాంజలి సమర్పించడం శ్రీశ్రీ పెద్దన తర్వాత స్విన్‌బర్న్‌కే చేశాడు. అది కూడా ముత్యాలసరంలోనే.

తనకు సొంత గొంతుక వచ్చిన తరువాత కూడా నచ్చిన తెలుగు కవులు శ్రీశ్రీకి ముగ్గురే-తిక్కన, వేమన, గురజాడ.

17. *నీ నాట్యమ్ములు నా మనఃస్థలినె కానిమ్మోయి!*
*నీ గానలీలా నైర్మల్యా నవోజ్జ్వల ప్రుతులు*

*కాల్వాలగట్టి నా కంఠమందే నిండంగ*
*నటియించుమోయి ! మధుమూర్తీ !*
*నీ కటాక్షద్యుతుల్ రానిమ్మోయి*
*మదీయ జీవిత తమిస్రద్వారమున్ జీల్చుచున్* **1929**

నాలుగేసి వృత్తాలలో ఒక కొస మెరుపుతో ముగించిన ఒక కవితా ప్రక్రియను శ్రీశ్రీ రూపొందించుకుని కొన్ని ఖండికలు రాశాడు. అందులో మధుమూర్తి ఖండికలోనిదీ శార్దూలం.

నాట్య సంగీతాలు, కవిత్వం గొప్ప కళలు అవి ఎలా లభిస్తాయి? వాటి వల్ల కలిగే ఆనందం ఎలా లభిస్తుంది? ఇవన్నీ ఏ దివ్యుడి సంపదలో ? ఆయనే కవికి 'మధుమూర్తి'. ఆయననే ప్రార్థించాడీ పద్యంలో. ఆ మధుమూర్తి ఎక్కడో చేసే నాట్యం తన మనస్సులోనే చేయాలట ! ఆయన సంగీతం తన కంఠం లోనే కాల్వలు కట్టించాలట! ఆయన క్రీగంటి చూపుల కాంతులతో తన జీవితపు చీకటి గుమ్మాన్ని పగులగొట్టాలట.

వాక్యాలనూ వాక్యరీతులనూ ఆవృత్తం చేస్తూ పద్యాన్ని నడిపించడంలో సిద్ధహస్తుడయ్యాడు. శ్రుతులు కాల్వలు కట్టడం, జీవిత తమిస్రద్వారం భావుకుల్ని ఆకర్షించే చిత్రాలు.

*18.* *అటనొకే దీర్ఘయామినీ !*
*ఆ నిశాశ్మశానతయ్యేవ ప్రాతఃప్రసక్తి లేదు!* **1929**

శ్రీశ్రీ కవితా జీవితంలో ఒక చిన్న మలుపుగా చెప్పదగిన ఖండిక 'సుప్తాస్థికలు'! అందులోని రెండు గీతిపాదాలే ఇవి.

ఇంతకుముందు గతవైభవం గొప్పదని తలపోసిన కవే ఇప్పుడు గతం మరి రాదని తెలుసుకున్నాడు. ఆ భావనలో సుప్తాస్థికలు (నిద్రించిన ఎముకలు) వెలువడ్డాయి. కరుణ బీభత్సాలవైపు కవి భావాలు మలుపు తిరిగాయి.

ఎముకలు చనిపోయిన వారికీ నిద్ర జడత్వానికీ ప్రతీకలు. సుప్తాస్థికలు (నిద్రించిన ఎముకలు) వెలువడ్డాయి. కరుణ బీభత్సాలవైపు కవి భావాలు మలుపు తిరిగాయి.

ఎముకలు చనిపోయినవారికీ నిద్ర జడత్వానికీ ప్రతీకలు. సుప్తాస్థికలంటే గతించిన మానవులు. భావనానేత్రంతో చూస్తే భూగర్భంలో మానవాస్థికా పరంపరలు కనిపించాయి. ఆ అస్థికాసంపుటాలలో శబ్దాలు లేవు. నిశ్శబ్దాలే

ఉన్నాయి. అవి పడి ఉన్న భూగర్భంలో (అట) ఒకే దీర్ఘయామిని. అది నిశాశ్మశానశయ్య! అసలే రాత్రి. దానికితోడు శ్మశానం. ఆ శ్మశానమే సుప్తాస్థి కల శయ్య. అవి ఎన్నటికీ నిద్రనుంచి మేల్కొనక పోవడానికి కారణం సూర్యోదయం (ప్రాతఃప్రసక్తి) కాకపోవడం.

నిశాశ్మశానశయ్య అనే పదబంధంలో అపూర్వమైన ఊహాసంవిధానం ఉంది. శబ్దార్థాలకు సమప్రాధాన్యం ఉంది. దీర్ఘయామిని అనే పదాన్ని దీర్ఘ రాత్రి అని మారిస్తే సొంపు చెడుతుంది..

ప్రాచ్యదృష్టిలో శ్మశానం అమంగళకరం కనుక పరిహరణీయం. కానీ జీవితవాస్తవికతవైపు మొగ్గుతున్న శ్రీశ్రీ సంప్రదాయాంధుడు కాడు. శ్మశానాల వంటి నిఘంటువులు అనగలడు. విశ్వమంతా వెలిబూదివోలె బహుళపంచమి జ్యోత్స్న నిండి ఉందనగలడు. ఖండపరశుగళకపాలగణాలను చూపించగలడు. యముని మహిషపు లోహఘంటల ఖణేల్ శబ్దాన్ని పసిగట్టగలడు.

*19. నేడు సంధ్యానిశీతారుణ ప్రభలు*
*దాచిన యామినిలో చరించు*
*నా మానసమింక*
*భావిసుషమావికసద్రుచు లాస్వాదించెదున్* (1929)

'భావిదృష్టి' అనే ఖండికలోని తుది ఉత్పలమాల చివరి పాదాలివి రెండూ.

ఈనాడు తాను ఒక రాత్రిలో సంచరిస్తున్నాడు. ఈ రాత్రికి ముందు న్నది సంధ్య. తరువాత వచ్చేది ఉషస్సు. ఆ సంధ్య ఎర్రని వాడి కిరణాలు గలది. దాన్ని దాచివేసినది ఈ రాత్రి. ఈ రాత్రిలో చరిస్తున్నది తన మనస్సు. కానీ ఈ రాత్రి ఎంతోకాలం ఉండదు. త్వరలోనే భావిసుషమావికసద్రుచులు వస్తాయి. ఆ రుచులను తన మనస్సు ఆస్వాదిస్తుంది. ఈ ఊహను ముద్దకట్టి చూపించాడు పై పంక్తుల్లో (మళ్ళీ చదవండి).

ఆ నాటినుంచీ నేటివరకూ శ్రీశ్రీ ఆశావాదియే! ఈ ఆశావాదం మార్క్సిజంతో వేళ్లూ ఊడలు కూడా పెంచుకుంది. ఎవరికీ కనిపించని అగ్ని కిరీట ధగధగలు శ్రీశ్రీకి ఎన్నడో కనిపించాయి. పుడమితల్లి పురుటి నొప్పులు ఆతనికి ముందే వినిపించాయి. జగన్నాథుని రథచక్రాలు వస్తున్నాయని ఎంత దూరంనుంచి చూశాడో మరి! బావుటానై పైకిలేస్తాను అన్నదీ ఈ ఆశావాదంతోనే!

20. *బాలపవనుండు ముందుగా౯ బరువులెత్త౯*
*బట్టగా౯ బోవగా వెల౯ బల్లటీల౯*
*గొట్టుచున్ బోవగా సాగె౯ గోమలంపు౯*
*జిన్ని కెరటాలు యమునలో౯ జెన్నుమిగిలి* (1930)

బాల గోపాల కృష్ణుడి వేణు గానాన్ని వర్ణించిన ఖండికలోనిదీ తేటగీతి. యమునలో చిన్ని కెరటాల వర్ణన ఇది. చిన్ని కెరటాలకు చిరుతగాలులకు పోటీ ఏర్పడింది. చిరుగాలికూడా ఒక బాలుడు, చిన్ని కెరటాలూ చిన్ని పిల్లలే బాలపవనుడు ముందు పరుగెడుతున్నాడు. అతనిని పట్టుకోవాలని చిన్ని కెర టాలు అతని వెనకాల పరుగెడు తున్నాయి. ఇదంతా యమునా నదిలో కనిపించే శైశవ క్రీడ. ఇలా వర్ణించడం గొల్లపిల్లల ఆటలకు కావ్యార్థ సూచనగా భాసిస్తోంది.

శైశవంమీద శ్రీశ్రీకి ఉన్న ఈ ఆసక్తియే 'శైశవగీతి' రాయించింది.

21. *ఈ విశాల సమగ్ర వాతావరణము*
*కాంతి తంత్రీ సుధామృదుగాన గీతు*
*లెగయు జగదీశ్వరాంఘ్రి మంజీరనటన*
*మటులనంత లీలానాట్య మభినయించె.* (1931)

సముద్ర తీరంలో పూర్ణచంద్రోదయాన్ని చూస్తున్న సందర్భంలోనిదీ వర్ణన. 'లాస్యతృష్ణ' ఆ ఖండిక పేరు.

అక్కడి వాతావరణం అంతా నాట్యం చేస్తున్నట్లు కనిపించింది తనకి. ఆ నాట్యం ఉద్ధతమైనది కాదు. లీలానాట్యం అది! అది అనంతం. దాన్ని చూస్తుంటే అతనికి గుర్తు వచ్చిన సాదృశ్యం పరమేశ్వరనాట్యం శివుడి కాలి అందె కదులుతున్నప్పుడు కాంతి తంత్రి మ్రోగి అమృత తుల్యమైన పాట మొదలవు తుందట. వెన్నెలతో నిండిన అక్కడి వాతావరణం శివాంఘ్రి మంజీరవలె నాట్య మాడిందట! మంజీరకూ చంద్రబింబానికీ పోలిక సూచిస్తాడే గానీ స్పష్టంగా చెప్పడు.

జగదీశ్వరాంఘ్రి మంజీరనటనము- జ, శ్వ, ఘ్రి, మ, జీ వంటి అక్షరాలు అందె మ్రోతను చవి చూపిస్తున్నాయి. ఈ సమాసంలో జగదీశ్వర శబ్దాన్నితీసి పరమేశ్వర శబ్దం పెడితే సొంపు చెడుతుంది. గణభంగం కలగకపోయినా ఏ పదం మార్పు సహించదో అది అనేక విధాల సమర్థమైన పదం.

మహాప్రస్థానం గీతాలలో ఏ ఒక్క పదమూ శబ్దమూ పరివృత్తిని సహించక పోవడానికి వెనుక శ్రీశ్రీ చేసిన సాధన ఇలాంటిదే? ఉదాహరణకు 'అరణ్యమున హరీంద్ర గర్జన'ను 'అడవిలోపల సింహం అరుపూ' అని మారిస్తే అది శ్రీశ్రీ కూర్పు అనిపించదు. ఈ కూర్పు నేర్పే మహాప్రస్థాన శ్రీశ్రీ విశిష్టత.

22. *రేగెడు గాలిలో*
*కలవరించెడు జీర్ణతృణాల జీవితాశాగతి*
*వేణుగానముగ జల్లన నూదుదునా?* 1931

ఇదొక మూగతలపు. ఒక యేటి ఒడ్డున ఒంటరిగా కూర్చుని చూస్తుంటే ఎన్నెన్నో దృశ్యాలు!

ఎదురుగా ఉన్న ఎండుగడ్డి పరకల గొట్టాలలో నుంచి గాలి వీచినపుడు పుట్టిన చిన్నిధ్వనిలో 'జీర్ణతృణాల జీవితాశ'ను గమనించగల్గుతున్నాడు. వెదురు బొంగులలోనుంచి ప్రవహించే గాలి వేణుగానానికి మూలం. అల్పమైన జీర్ణతృణాన్ని మాత్రం తాను ఉద్ధరించి ఊదితే వేణుగానం బయల్దేరదా? కలవరించే జీర్ణతృణాలను అల్పజీవులకు ప్రతీకలుగా భావించి పతిత జనోద్ధరణాభిలాషను సూచిస్తున్నాడు. కలవరించు-జీవితాశ అనే మాటల్ని ప్రకృతికీ మానవజీవితానికీ వంతెనలు వేయడానికి ప్రయోగించాడు.

ప్రకృతిలోంచి మానవ సమాజంలోకి వచ్చి 'పతితులార భ్రష్టులార బాధాసర్పదష్టులార ఏడవకండ ఏడవకండి' అని ఓదార్చడానికి ఇదే ప్రాతిపదిక.

23. *ప్రవాహినీ వేగములో*
*చలించి మొరవెట్టు మహీరుహమందు*
*నార్తిపోగా గిలిగింత కొల్పి*
*తమకమ్మున నొడ్డున చేరవైతునా?* 1931

ఇది మరో మూగతలపు. ఆ యేటి యొడ్డున ఉన్న చెట్టొకటి వరద వేగానికి కొట్టుకొని పోవడాన్ని చూశాడు. అది తనకు గలిగిన ఆపదనుంచి తప్పించుకోలేనివానిలా మొరపెడుతున్నట్లు అనిపించిందట! తాను దాన్ని ఒడ్డుకు చేరవేసి ఆనందం కలిగించకూడదా అని కవి మూగతలపు. మొరవెట్టు, గిలిగింతకొల్పు, ఒడ్డుకు చేరవేయు అనే జాతీయాలను అచేతనమైన చెట్టుపట్ల ప్రయోగించడం ద్వారా ప్రకృతిలోంచి మానవ ప్రపంచంలోకి అడుగు పెడుతున్నాడు శ్రీశ్రీ.

కలవరించెడు జీర్ణతృణాలు, మొరవెట్టు మహీరుహం వంటివి ప్రతీకాత్మక పదచిత్రాలు. గడుసు దయ్యాలు, ఒంటరి ఒంటె, బయల్దేరిన రథ చక్రాలు, కదిలిన సింహాచలం వంటివి మరికొన్ని.

**24.** *సంపెంగ విరిపైడి చాయలో నాకేమొ*
*వంపు తేరిన కత్తివలె నుంటివిరేయి.* **1932**

'ఖండశశి'లోది ఈ ఖండగతి గేయ పాద ద్వయం.

ఈ గీతం రాసిన రేయి కవికి కనిపించినవాడు చవితి చంద్రుడు. చవితి చందమామ వల్ల లోకమంతా భయంకరంగా కనిపించింది. లోకమే కాదు; ఆనాటి చంద్రుడి ఆకారమే అతనికి భయంకరంగా కనిపించింది. ఆ భయం వల్లనే చంద్రుడ్ని నిందిస్తున్నాడు. ప్రబంధాలలోని చంద్రోపాలంభనాలకు కారణం నాయిక విరహాతిశయంకాగా ఇక్కడి చంద్రనిందకు కారణం వ్యక్తిగత దుఃఖం.

మెరిసేదంతా బంగారం కాదన్నట్లు పైడిచాయలో కనిపించే ఖండ చంద్రుడు క్రూరంగా వంపుతేరిన కత్తి (కొడవలి)లా కనిపించాడు పైడిచాయ ధనానికీ వంపుతేరిన కత్తి క్రౌర్యానికీ ప్రతీకలు. భవిష్యత్కవితాధ్యాయంలో ఈ కవి ధనస్వామ్య వ్యవస్థమీద విరుచుకుపడతాడు. దానికిది ఒక విధంగా ప్రాతిపదిక.

1933లో రచించిన ఒకరాత్రి ఖండికలో బహుళ పంచమి చంద్రుడు కూడా శ్రీశ్రీని భయపెడతాడు. ఇక్కడ చంద్రుడు వంపుతేరిన కత్తి; అక్కడ కాళ్లు తెగిన ఒంటరి ఒంటె!

కవి భావాల కనుగుణంగా లోచిన ఈ ఉపమానాలు సంప్రదాయం నుంచి వచ్చినవికావు. సొంతంగా ఎంచుకున్నవే!

**25.** *వేటకాని కోలలకు కూలి*
*వేదనల తూలు హరిణాల కండ్లు*
*జాలికి పుట్టిండ్లు*
*దిక్కుదిక్కుల కంపిన దీనంపు చూడ్కులే*
*ఆనాటి*
*ప్రళయతాండవ భయంకర సౌదామినులు!* **1933**

శ్రీశ్రీగారి మొట్టమొదటి గ్రాంథిక వచనపద్యం విద్యున్మాలికలు. అందులోని కొసమెరుపే ఈ వచనపద్యం.

భావకవిత్వానికి భరతవాక్యం చెప్పి అభ్యుదయ కవిత్వానికి నాంది ప్రస్తాపన పలకడం 'విద్యున్మాలికలు' లో వినిపిస్తుంది.

మెరుపుల్ని చూశాడు ఆ రాత్రి. లోకంలోని అనేక సంఘటనలు ఆ మెరుపులవల్ల జ్ఞాపకానికి వచ్చాయి. అవి దారితప్పిన బాటసారులా? కవి భావాలా? కొత్త పెళ్ళికూతురి సిగ్గులా? ప్రవాస జీవితంలోని అప్సరసలా? పూలతోరణాలా? దివ్యబాలికల పావడా జలతారులా? ఇలాంటి ఊహలన్నీ పాతవే! శృంగార రసానికి సంబంధించినవే. ఒక కొత్త ఊహ వచ్చింది. వేటగాని వల్ల గాయపడిన లేళ్ల కళ్ల వలె జాలిని కలిగిస్తున్నాయి ఆ మెరుపులు. ప్రళయంలోని తాండవం వలె భయంకరంగా ఉన్నాయి ఆ మెరుపులు. పీడక పీడిత వర్గాలను లోకంలో చూశాడు కాబోలు, తాను లేళ్లను చూసే జాలి పడతాడు— తన శోకమే శ్లోకం కావాలి! చిత్తవికాసం నుంచి చిత్తద్రుతికి బయల్దేరుతున్నాడిక్కడ.

దెబ్బతిన్న లేళ్ల కళ్లు జాలిక పురిటిళ్ల వంటివి. ఆ కళ్లలోంచే జాలి పుడుతుంది. ఆ లేళ్లు మమ్మల్ని రక్షించేవాళ్లెవరూ లేరా అన్నట్లు దిక్కుదిక్కులకూ చూస్తున్నాయి. దిక్కులేని వారికి దేవుడా దిక్కు? దేవుడుంటే వేటగాడినే నివారించరాదూ?

ఆ దీనంపు చూడ్కులు చేతకానివిలా ఉండిపోవడం కవికి ఇష్టంలేదు. అవి ప్రళయతాండవం చేస్తాయి.

ఈ గ్రాంథిక వచన పద్యంలో పాదాల విభజన ఉందికానీ పాదసంఖ్యా నియతిలేదు. నిర్దిష్టచ్ఛందస్సులేదుగానీ లయాత్మక వాక్య రచనలో ఛందశ్శకలాలున్నాయి. వృత్తగంధి పాదాలున్నాయి. దిక్కుల కంపినదీ నంపు చూడ్కులే — అన్నది సీసపాద భాగమే! వేదనలతూలు హరిణాల కండ్లు జాలి— తేటగీతి నడకే ఇది! ప్రళయతాండవ భయంకర సౌదామినులు— ముత్యాల సరం నడకే ఇది!

ఈ గ్రాంథిక వచన పద్యమే 'ఆకాశదీపం' వంటి వ్యావహారిక వచన పద్యానికి తల్లివంటిదయింది.

* * *

***26.*** *నేను సైతం*
*ప్రపంచాగ్నికి*
*సమిధ నొక్కటి ఆహుతిచ్చాను!* ***1933***

'జయభేరి' ఖండికలో మొదటి ముత్యాల సరపు ముక్క ఇది. మహా ప్రస్థానంలో కాలానుక్రమాన్ని బట్టి ఇదే తొలిపలుకు.

ఇక్కడ 'నేను' శ్రీశ్రీ కాదు. శ్రీశ్రీ కంఠంతో పలుకుతున్న శ్రామికుడు. ప్రపంచాభ్యుదయం కోసం అతడెన్నో త్యాగాలు చేశాడు. ఎంతో కృషి చేశాడు గతంలో. అంతా నెమరు వేసుకుంటున్నాడిప్పుడు.

నేను సైతం అనే నుడికారం మానవజాతి చరిత్రలో పేరుకు కూడా నోచుకోని ఒక సామాన్యుడికి ప్రాముఖ్యం కలిగిస్తోంది. తరతరాల నుంచి ఇతడికి చరిత్రలో గుర్తింపులేదు. ఇప్పుడితడు తిరగబడి తన ప్రాముఖ్యం గుర్తించవలసిందిగా ఘోషిస్తున్నాడు.

అగ్నికి సమిధనాహుతి ఇవ్వడం ఆ అగ్ని ఆరిపోకుండా నిరంతరం మండుతూ ఉండటానికే. ప్రపంచాగ్ని ఆరిపోతే ప్రపంచమే లేకుండా పోతుంది. అగ్నిలేనిదే మనిషి జీవనం నడవదు. పూరాతన వైదిక సంస్కృతిలో యజ్ఞవేదిక ముందు సమిధలను అగ్నికి ఆహుతి ఇస్తూ ఉండేవారు ఆ వేదకాలంనాటి వాడే శ్రామికుడు. ఈ పంక్తుల్లో శ్రామికుడు తన గతాన్ని అవగాహన చేసుకున్నాడు. వర్తమానంలో తిరుగుబాటు చేస్తాడు. భవిష్యత్తులో జయభేరి మ్రోగిస్తాడు -నేను సైతం ప్రపంచాబ్జపు తెల్లరేకై పల్లవిస్తాను అంటూ.

శ్రీ శ్రీ పీడితజనం కోసం తన కవిత్వాన్ని అంకితం చేశాడు. వారి అభ్యుదయమే ప్రపంచాభ్యుదయం— కవిత్వాభ్యుదయం.

ఈ గీతం ముత్యాలసరంలోని ఏకదేశం. ముత్యాలసరంలో 2 పాదాలే మూడు పాదాలుగా విడదీయబడ్డాయి. 29 మాత్రలకు కుదింపబడింది (7+7+15).

27. *ఆకాశపు బెడారి*
*లో కాళ్లు తెగిన*
*ఒంటరి ఒంటె లా*
*గుంది జాబిల్లి !* *1933*

'ఒక రాత్రి' లో శ్రీశ్రీకి కనిపించిన ఒక దృశ్య చిత్రం ఇది. ఆ రాత్రి బహుళపంచమి. నాటి వెన్నెల అతడ్ని భయపెడుతుంది.

సాగరతీరంలో వెన్నెలలో కొండప్రక్క కూర్చున్న కవి ఆనందానికి బదులు విషాదాన్ని అనుభవిస్తాడు. సౌందర్యానికి బదులు వికృతత్వాన్ని

దర్శిస్తాడు. అతనికి తన చుట్టూ ఉన్న వాతావరణం అంతా భయంకరంగా కనిపిస్తుంది. ఇందుకు కారణం సమాజ జీవిత వాస్తవికత.

వ్యక్తిగతంగా తనకు కలిగిన అనుభవాన్ని శ్రీశ్రీ శ్రామిక జీవితానికి అన్వయిస్తాడు. తానూ ఒక శ్రామికుడే కదా !

ఇసుక తుపాను రేగిన ఆకాశపుఎడారిలో జాబిల్లి ఎలాగుంటాడు ? ఆతడు బరువును మోస్తున్న ఒంటరి ఒంటె! తుపాను వల్ల కాళ్లు తెగిపోయాయి. పురోగమనం సాగించలేని కుంటి మనిషికి జాబిల్లి ప్రతీక.

బహుళ పంచమి నాటి జాబిల్లి వాస్తవానికి కూడా ఆకారసామ్యం చేత కాళ్లు తెగిన ఒంటరి ఒంటెలాగే కనిపిస్తుంది. ఈ ఉపమానం అతినవ్యం. విలక్షణం.

నిజానికి కవి కూడా నిరుద్యోగియై ముందుకు పోలేని అస్వతంత్ర పరిస్థితిలో ఉన్నాడు. తన పరిస్థితికి కారణం సమాజంలోని దోపిడియే ! ఈ అవగాహనే శ్రీశ్రీ కవిత్వాన్ని భావకవిత్వం నుంచి వేరు చేస్తోంది.

వర్గవిభజన గల ధనస్వామ్య సమాజంలో ఎవడికి వాడే జీవితభారాన్ని మోసుకుంటూ వ్యవస్థలోని అవకతవకలవల్ల అసహాయుడై ఏకాకియై మిగిలిపోవడం ఇక్కడ సూచ్యం.

ఈ గీతంలోనే పొగ, దయ్యాలు, అరుపులు, కళేబరం, వెలిబూది వంటి ప్రతీకలు సమాజ బీభత్సాన్ని వ్యక్తం చేస్తాయి.

మంజరీ ద్విపదను ఖండగతితో మాత్రాబద్ధం చేసి నాలుగు పాదాలుగా విరిచి రాశాడు శ్రీశ్రీ.

*28.* *కదం త్రొక్కుతూ*
*పదం పాడుతూ*
*హృదంతరాళం గర్జిస్తూ*
*పదండి పోదాం,*
*వినబడ లేదా*
*మరో ప్రపంచపు జలపాతం ?* *1934*

మరో ప్రపంచం అనే సామ్యవాద సమాజ వ్యవస్థలోకి కదిలించడానికి తానే ఒక విప్లవనాయకుడై ప్రజలను ప్రేరేపిస్తూ రచించిన గేయం 'మహాప్రస్థానం.' అందులోదే ఈ గీతం.

సామ్యవాదం సాధించడం కేవలం కవిత్వంతో జరిగేదికాదు. రాజకీయార్థిక విధానాల్లో మార్పుద్వారా వచ్చే సామ్యవాదానికి ప్రజల తిరుగుబాటే మార్గమవుతుంది. ఆ తిరుగుబాటును ప్రేరేపించడమే కవిత్వం చేయగలిగేది.

కదం త్రొక్కుతూ పదం పాడుతూ హృదంతరాళం గర్జిస్తూ ప్రజలను ముందుకు నడవ వలసిందిగా చెప్పిన శ్రీశ్రీ మొదటి క్రియతో గుర్రాలవలె బరువును మోస్తూ ఉత్సాహంతో పరుగు తీయవలసిందనీ రెండవ క్రియతో యాంత్రికంగా కాక ఆవేశ పూరితంగా సమష్టిగా కదలవలసిందనీ మూడవ క్రియతో సింహాలవలె గర్జిస్తూ పీడక వర్గం మీద విరుచుకుపడవలసిందనీ సూచించాడు. ఉపమానాలను వాచ్యం చేయలేదు.

మరోప్రపంచం రష్యాలో ఈ గీతం రాసేనాటికీ ఏర్పడింది కనుక అది కేవలం ఊహాస్వర్గంకాదు. అందుకే వినబడలేదా మరో ప్రపంచపు జలపాతం? అని ప్రశ్నించాడు. నిత్య ప్రవాహశీలమూ స్వచ్ఛందమూ ధ్వనిబంధురమూ శక్తిమంతమూ అయిన జలపాతాన్ని జనచైతన్యానికి ప్రతీకగా తీసుకున్నాడు.

నాలుగు పాదాలకు ప్రాస వేయడం, అదిని లగం వాడటం గేయానికి గతివేగం కలిగించాయి. సజీవమైన వ్యావహారిక క్రియలు వాడటం (త్రొక్కుతూ పాడుతూ గర్జిస్తూ పదండి పోదాం వినబడలేదా) వల్ల చెప్పదలచింది గుండెల్లోకి దూసుకుపోతోంది.

ఇందులోది చతురస్రగతి. ఎనిమిది మాత్రల గణాలున్నాయి. 3,6 పాదాల్లో 14 మాత్రలున్నాయి. ఇవి 8+6 గా విరుగుతాయి. ముత్యాల సరంలో పాదానికి 14 మాత్రమే ఉంటాయి. ఆ సంఖ్యే ప్రమాణంగా తీసుకుని నూతనత్వం సాధించాడు శ్రీశ్రీ.

*29. ప్రపంచమొక పద్మవ్యూహం!*
*కవిత్వమొక తీరని దాహం!* *1934*

'ఋక్కులు' లోని చివరి చరణాలివి. మరో ప్రపంచాన్ని స్వప్నంలో దర్శించిన శ్రీశ్రీ ఈ ప్రపంచాన్ని వాస్తవంగానే చూశాడు. ఈ దర్శనంలో ప్రపంచం ఒక 'పద్మవ్యూహం' వలె కనిపించింది. అధర్మపక్షం వారు ఒక బాలవీరుడ్ని నిర్బంధించడానికి చాకచక్యంతో నిర్మించిన సేనావ్యూహం పద్మవ్యూహం. ఆ పద్మ వ్యూహంలో ప్రవేశించడమూ కష్టమే. ప్రవేశించాక యుద్ధం చేయడమూ కష్టమే. శ్రీశ్రీ చూసిన పద్మవ్యూహ ప్రపంచం బూర్జువా-సామ్రాజ్య

వాదఫాసిస్టు ప్రపంచం. పీడిత జనుల జీవితాలు యుద్ధరంగాలై వాళ్ళ చుట్టూ శత్రువులున్నారని 'పద్మవ్యూహం' అనే ప్రతీక వ్యక్తం చేస్తుంది. ఈ ప్రపంచంలోనే బాటలూ పేటలూ కోటలూ నదీనదాలూ అడవులూ కొండలూ ఎడారులూ సింహాలూ సివంగులూ ఫిరంగులూ సృగాలాలూ బిడాలాలూ ఇసుక తుపానులూ గడుసుదయ్యాలూ ఉన్నాయి. ఇవేవీ లేని ప్రపంచాన్ని చూడాలను కుంటున్నాడు శ్రీశ్రీ. జలపాతాలు, నగరాలు, ఎర్రబావుటాలు గల సామ్యవాద ప్రపంచం అది.

రస స్వరూపమైన కవిత్వం శ్రీశ్రీకి శ్రీశ్రీవంటి పీడితులకూ తీరనిదాహం. పీడకులకు కవిత్వం కన్నా ధనం ఒక తీరనిదాహం. వారికి కవిత్వం విరామ సమయ వినోదమే ! మరి పీడితులకు సామ్యవాద విప్లవ చైతన్యాన్ని అందిచ్చేది కవిత్వం. కదిలేదీ కదిలించేదీ పాడేదీ పాడించేదీ మునుముందుకు సాగించేదీ పెనునిద్దుర వదిలించేదీ పరిపూర్ణపు బ్రతుకిచ్చేదీ కవితా రసమే !

ఈ రెండు పాదాలూ బిందువుతో ముగుస్తాయి. ఇందువల్ల శ్లోకగమనం సిద్ధించింది. 6మాత్రలమీద పదవిరతిని పాటించి 6+8 మాత్రల విరుపుతో వేగం, లయ సాధించాడు. 14 మాత్రల కొలత ముత్యాలసరం నుంచి తీసు కున్నదే. ప్రపంచమొక— కవిత్వమొక— అంటూ 'ఒక' అనే వాడుక ఊతపదం అర్థ విశేష స్ఫూర్తి కలిగించేటట్లు వాడబడింది. మొదటి 'ఒక' విసుగునూ రెండవ 'ఒక' ఉత్సాహాన్నీ సూచిస్తాయి.

30. *కనకదుర్గా చండసింహం జూలుదులిపీ, ఆవులించింది!*
*ఇంద్రదేవుని మదపుటేనుగు ఘీంకరిస్తూ సవాల్ చేసింది !*

*1934*

'అవతారం' గేయంలో గుండెకాయవంటి భాగమిది. ఈ భాగానికి పైన మూడు గీతాలు అవరోహణ క్రమంలోనూ కింద మూడు గీతాలు ఆరోహణక్రమం లోనూ నడుస్తాయి. మధ్యనున్న ఈ గీతం సమాంతర క్రమంలో నడిచింది. అవరోహణ సామ్యవాద విప్లవంలోని 'కదలిక'నీ సమాంతరం 'అల్లకల్లోలాన్నీ' ఆరోహణ 'మార్పు'నీ సూచించే స్వరూపాలు.

జూలుదులిపీ ఆవులించడం, ఘీంకరిస్తూ సవాల్ చేయడం అల్లకల్లోలాన్ని సూచిస్తాయి.

ధనస్వామ్య వ్యవస్థకు ప్రతినిధి అనదగిన హిరణ్యాక్షుడ్ని పీడితవర్గ ప్రతి నిధియైన ఆదిమహావిష్ణువు జంతువుగా మారి (ఆది సూకర వేదవేద్యుడు) చంప

బోతున్నాడని తెలిసి దేవతలంతా వస్తుంటే వారి వాహనాలైన జంతువుల ఉద్రే కాన్ని శ్రీశ్రీ వర్ణించాడు.

చండసింహం ఆవులించడం, మదపుటేనుగు సవాల్ చేయడం ఇంద్రియాల కదలికను చూపే భావచిత్రాలు మాత్రమే గాక జంతువులకు మానవ చేష్టలను ఆరోపించే పద చిత్రాలు కూడా.

29 మాత్రల ముత్యాలసరం భాగాన్ని ఒకే దీర్ఘపాదంగా రాయడంద్వారా వైవిధ్యం సాధించాడు శ్రీ శ్రీ. ఇదే పాదాన్ని ఆరోహణావరోహణ క్రమాల్లో కూడా వ్రాయవచ్చును.

కనకదుర్గా
చండసింహం
జూలుదులిపీ ఆవులించింది.
కనకదుర్గా చండసింహం
జూలుదులిపీ
ఆవులించింది.

కానీ భావోద్దీపనానికి ఏ క్రమం అనురూపమైనదో నిర్ణయించుకుంటాడు శ్రీ శ్రీ.

**31.** *అతని బ్రతుకునకదే ఆఖరు !*
*గ్రుడ్డి చీకటిలోన గూబలు*
*ఘూకరించాయి*
*వాన వెలిసీ మబ్బులో ఒక*
*మెరుపు మెరిసింది ;*
*వేగుజాముసు తెలియజేస్తూ*
*కోడి కూసింది ;*
*విడిన మబ్బుల నడుమనుండీ*
*వేగుజుక్కా వెక్కిరించింది ;*
*బాటసారి కళేబరంతో*
*శీతవాయువు ఆడుకుంటోంది !*
*పల్లెటూళ్లో తల్లికేదో*
*పాడుకలలో పేగు కదిలింది !* **1934**

బాటసారి మరణానంతర కథ ఇది. అతని బ్రతుకునకదే ఆఖరు అంటూ ఒక్క ముక్కలో మరణాన్ని సూచించిన శ్రీశ్రీ మొట్టమొదటనే చెప్పాడు

'పట్టణంలో బ్రదుకుదామని' అతడు బయలుదేరినట్లు ! ఈ సంకల్పం పట్టణం చేరకుండానే విఫలమైపోయింది.

అంతవరకూ చెప్పిన కథ ఒక ఎత్తు; మరణానంతర కథ ఒక ఎత్తు. మరణించాక కథ ఏమిటి ? ఇందులోనే ఉంది కథకుడి ప్రతిభ. తల్లిని వదలి వచ్చిన బాటసారి హఠాన్మరణానికి ప్రకృతి దుఃఖించిందని చెప్పాడు శ్రీశ్రీ. బాటసారి మరణించిన సమయం రాత్రి కాగా గుడ్లగూబ కూతతో తొలిజామునూ వానవెలిసి మబ్బులో నుంచి మెరుపు మెరియడంతో రెండో జామునూ కోడి కూతతో వేగుజామునూ వేగుజుక్కతో ఉషస్సునూ శీతవాయువుతో సూర్యోదయాన్నీ తెలిపి బాటసారి కళేబరాన్ని పాఠకులకు ఆ వెలుగులో చూపించాడు.

కథ యింతటితో పూర్తి కావలసిందే కానీ అలా పూర్తి చేయకుండా కథ మొదలైన పల్లెటూరికే కథను తీసుకుపోయి, ''తల్లికేదో పాడు కలలో పేగు కదిలింది'' అంటూ ముగించాడు.

ప్రకృతి వర్ణనలో సమయవర్ణనను సమ్మిళితం చేయడం శ్రీశ్రీ శిల్ప మర్మం.

గ్రుడ్డి చీకటిలోన గూబలు ఘూకరించాయి అనే మొదటి ధ్వని చిత్రంలో గ్రుడ్లగూబల సహజ ఘూకారవాన్ని బాటసారి మరణ పరామర్శగా ఉత్ప్రేక్షించి ప్రకృతి శోకానికి సంకేతం చేశాడు.

బాటసారి దారిలో ఉండగానే వాన వచ్చిందంటూ సూచించి అతని కష్టాలకు ఆ వానను ప్రతీకగా తోపించి అతని మరణంతో తీరిపోయిన ఆ కష్టాలను వర్షాంతంలో సూచిస్తూ 'వానవెలిసీ మబ్బులో ఒక మెరుపు మెరిసింది' అన్నాడు.

'వేగుజామును తెలియజేస్తూ కోడి కూసింది' అన్న ధ్వని చిత్రంలో కోడికూత ప్రయోజనాన్ని కవియే చెప్పివేశాడు.

వాన వెలిసి, మబ్బులు విడి, మెరుపు మెరిసి, కోడి కూసేసరికి రాత్రి అంచెలంచెలుగా వెళ్ళిపోయింది.

విడిన మబ్బుల నడుమ నుండీ వేగుజుక్కా వెక్కిరించింది అనే దృశ్య చిత్రంలో వేగుజుక్క మేధావికీ, వెక్కిరింత అతడు చేసే పరిహాసానికీ సంకేతాలు. దేశంలో వేలాది మంది యువకులు కూలికీ కూటికీ కరువాచి పట్టణాలకు చేరుకునే లోగానే మరణించడానికేది కారణమో దాన్నే వేగుజుక్క వెక్కిరిస్తుంది.

బాటసారి శవం దారిలో పడిపోయి ఉండగా అతని కళేబరంతో శీత వాయువు ఆడుకుంటోంది అంటూ ఆ కళేబరం ఒక ఆటవస్తువుగా ప్రకృతికి మిగిలిపోయిందని సూచించాడు.

బాటసారిని మొదటే వెళ్ళవద్దన్న తల్లి-అతడు వెళ్ళిన తరువాత గృహాంగ ణంలో నిలబడి కొడుకు కోసమే చూస్తూ ఉన్నతల్లి-కొడుకు చనిపోయాడని ఎలా తెలుసుకో గలదు ? ఆమెకు పాడుకలలో పేగు కదిలింది అని చెప్పిన కవి ఆ కల ఏమిటో చెప్పకుండానే కొడుకు మరణాన్ని ఆమె చూసిందని సూచించాడు. మరి ఆ తల్లి ఏమై పోయిందన్న విషయాన్ని ఊహించుకోవలసిందే.

**32. 'అనర్గళం, అనితరసాధ్యం నా మార్గం' 1934**

వేదకాలంనాటి ఆదిమ కుటుంబ వ్యవస్థలో– మధ్యయుగంనాటి ఫ్యూడల్ వ్యవస్థలో– ఆధునికయుగంలోని బూర్జువా వ్యవస్థలో కావ్యస్రష్ట అయిన కవిని తానే అంటూ శ్రీశ్రీ పలికిన ప్రతీకాత్మక ప్రగల్భాలలోనిది ఈ వాక్యం.

తన మార్గం అనర్గళం అనీ అనితర సాధ్యం అనీ చెప్పుకోవడంలో ఆత్మ విశ్వాసాతిశయం ఉంది ; గర్వం ఉంది.

శ్రీనాథుడు, పెద్దన, తెనాలి రామకృష్ణుడు తమ కవిత్వాన్ని గురించి కృతిపతుల మాటల్లో తామే చెప్పించుకున్నారు. ఆ మాటలు అతిశయోక్తులు కావని తమ కవితా వైభవ ప్రదర్శనం ద్వారా నిరూపించుకున్నారు. శ్రీ శ్రీ ఆవిధంగా మరొకరి మాటల్లో కాకుండా తన మాటల్లోనే తన కవిత్వాన్ని గురించి చెప్పుకుని వాటిని రుజువు చేసుకున్నాడు.

శ్రీ శ్రీ మార్గం అనర్గళం అనేది తిరుగులేని మాటే ! అనితరసాధ్యం అనేది నిత్యప్రవర్ధమానమయ్యే కావ్యకళ విషయంలో సాధ్యం కానిది. 'పేరడీ' చేయగల్గిన జరుక్ శాస్త్రి, దేవీప్రసాద్ వంటివారికి శ్రీ శ్రీ మార్గం సుసాధ్యమే అయింది.

అదీగాక, కవిత్వంద్వారా సామాజిక విప్లవం కోరే శ్రీశ్రీవంటి కవి తన మార్గం అనితర సాధ్యంగా ఉండాలని అనుకోడానికి వీలులేదు. తన మార్గాన్ని ఎందరో అనుసరిస్తేనే తన ఆశయం సఫలీకృతం అవుతుంది. అయితే ఎందరో అనుసరించారు కానీ శ్రీశ్రీ మార్గాన్ని సాధించుకోలేక పోయారు. కారణం? శ్రీశ్రీకి ఉన్న ప్రతిభావ్యుత్పత్తి అభ్యాసాలు వాల్మీకినుంచి తనదాకా అనుస్యూతంగా వస్తున్న వాటి వారసత్వం వల్ల పదునుదేరినవే. శ్రీశ్రీ కవిత్వం పెక్కుమార్గాల

సమ్మేళనం వల్ల రూపొందింపబడిన స్వతంత్రమార్గం! అందుకే అనితరసాధ్యం.

'కువిమర్శా మృణ్మయ నిర్జవ మస్తిష్కాలు గ్రహింప జాలుదురా మత్ ఛవిమత్ పవివత్ కవితాక్షి విలోకన తీక్షధార !' అంటూ శ్రీశ్రీ చేసిన సవాలు. అనన్య సామాన్యమే !

ఒక కృతిపతిచేత శ్రీశ్రీ కూడా పొగిడించుకున్నాడు—'వాగ్నేతవు నీవె, మహోగ్రాగ్న్యుర్వీధరము నీవె అమృత హిమానీరుగ్ న్యగ్రోధము నీవె అసృగ్ నృత్య గురుండవీవె సిరిసిరి సుకవీ ?' అని.

*33. ఋతువులరాణీ వసంతకాలం*
*మంత్రకవాటం తెరుచుకునీ,*
*కంచువృషభముల అగ్నిశ్వాసం*
*క్రక్కే గ్రీష్మం కదలాడీ,*
*ఏళ్లు, బయళ్లూ, ఊళ్లూ, బీళ్లూ*
*ఏకం చేసే వర్షాకాలం,*
*స్వచ్ఛకౌముదుల శరన్నిశీథినులు,*
*హిమానీ నిబిడ హేమంతములు,*
*చలివడకించే శైశిరకాలం*
*వస్తూపోతూ దాగుడుమూతల*
*క్రీడలాడుతవి మీ నిమిత్తమే !* 1934

'శైశవగీతి' లోనిది ఈ ఋతువర్ణన. ఋతువులన్నీ మన్మథోద్దీపకాలుగా ప్రబంధ కవులకు కనిపిస్తే, ఋతువులన్నీ దివ్యలోకాలుగా భావకవులకు కనిపిస్తే శ్రీశ్రీ కి మాత్రం ఋతువులన్నీ శిశువుల కోసం దాగుడుమూత లాడుతున్నట్లు కనిపించాయి.

ఒకటి కనిపించినపుడు మరొకటి అదృశ్యం కావడం దాగుడుమూత. ఆరు ఋతువులు ఒకదాని తరువాత ఒకటి వస్తాయి. శిశుముగ్ధమైన చిత్త ప్రవృత్తి లేనివాడు శిశువులా ఊహించలేడు.

వసంతకాలం ఋతువుల రాణి. అలీబాబా కథలోలాగ మంత్ర కవాటం తెరుచుకుని వస్తుంది. గ్రీష్మకాలం కంచువృషభం. అది అగ్ని శ్వాసం క్రక్కుతుంది. వర్షాకాలం భిన్న భిన్నంగా ఉండే ఏళ్ళనూ బయళ్ళనూ ఊళ్ళనూ బీళ్ళనూ ఏకం చేస్తుంది. శరత్కాలం వెన్నెల రాత్రులను తెస్తుంది. హేమంత

కాలం మంచు ముద్దలాగ వస్తుంది. శిశిరకాలం చలితో వణికిస్తుంది. ఈ ఆరు ఋతువులూ శిశువులే ! చిత్రవేషాలూ చిత్రక్రియలూ వారివి !

ఈ ఆరింటిలో మొదటి మూడింటికీ కట్టిన బొమ్మలవలె తరువాత మూడింటికీ బొమ్మలు కట్టలేదు శ్రీశ్రీ.

జీవితంలోని అరిషడ్వర్గాల ఛాయలను ఈ భావచిత్రాలలో చూపించాడు శ్రీశ్రీ. ఋతువుల రాణి అన్నప్పుడు కామం, అగ్నిశ్వాసం అన్నప్పుడు క్రోధం, వర్షకాలంలో లోభం, శరన్నిశీథినులలో మోహం, హిమానీనిబిడ హేమంతంలో మదం, చలివణికించే శైశిర్యంలో మాత్సరం పొంచి చూస్తాయి.

శ్రీశ్రీలో శిశుప్రవృత్తి ప్రౌఢ చిత్తవృత్తి కలగలసి ఉంటాయి.

గ్రీష్మకాలం కంచువృషభముల అగ్నిశ్వాసం క్రక్కుతుందన్నప్పుడు వేసవి ఎండల తీవ్రత వ్యక్తమవుతుంది. శ్వాసం వదలడం కాకుండా క్రక్కడం అయినందువల్ల భయంకరత్వం అభివ్యక్తమవుతుంది. శ్వాసం ముక్కు ద్వారా జరుగుతుంది. క్రక్కడం నోటిద్వారా జరుగుతుంది. ఈ రెండు ఇంద్రియ క్రియలనూ కలిపివేశాడు శ్రీశ్రీ శ్వాసకు అగ్నిరూపం కల్పించాడు. నిజానికి శ్వాస వాయురూపంలో ఉంటుంది. ఇంద్రియక్రియలను మిశ్రమం చేయడం సింబాలిస్టుల సంవిధానం.

*34.* *—ఎచటికి పోతావీరాత్రి ?*
*— అవతలి గట్టుకు !* *1934*

'ఆవతలిగట్టు' అనే మినీ కవితలోనివి ఈ ప్రశ్నా జవాబూ !

విరుద్ధ వర్గాలు గల ప్రపంచం నుంచి వర్గాలే లేని మరో ప్రపంచానికి చేసే ప్రయాణం నది ఇవతలి ఒడ్డు నుంచి అవతలిగట్టుకు చేసే ప్రయాణంతో పోల్చబడింది.

ఎచటికి పోతావీ రాత్రి? అనే మితవాది ప్రశ్నకు అవతలిగట్టుకు ! అనేది అతివాది జవాబు. ఈ సమాధానమే ప్రాశ్నికుడ్నీ యాత్రికుడ్నీ నిజ స్వరూపాలతో మనముందు ఉంచుతోంది. మరోప్రపంచం, ఆవతలిగట్టు రెండూ సామ్యవాద ప్రపంచానికి ప్రతీకలే.

ఇవతలిగట్టున రాత్రివేళ మిగిలిపోయినవాడు పీడితుడు. ఇతడు ఆశావాది కనుకనే కష్టాలను లెక్కచేయకుండా చీకటిలో ప్రయాణం చేస్తాడు.

*35.* *ఎగిరించకు లోహవిహంగాలను*
*కదిలించకు సుప్తభుజంగాలను*

*ఉండనీ,*
*మస్తిష్క కులాయంలో!*
*మనోవల్మీకంలో!* **1934**

'సాహసి' ఖండికలోనిది ఈ గీతం. మితవాది హితబోధలను అతివాది వెక్కిరిస్తున్నాడు.

తీవ్రమైన విప్లవ భావాలను మెదడులో దాచుకోలేని సాహసి వాటిని ప్రపంచంలోకి వదలుతూనే ఉంటాడు. అతడ్ని మితవాది ఎగిరించకు లోహ విహంగాలను ఉండనీ మస్తిష్కకులాయంలో అని మందలిస్తాడు. ఈ మందలింపును అతివాది వెక్కిరిస్తే ఎగిరించుము లోహవిహంగాలను ఉంచకోయ్ మస్తిష్కకులాయంలో అనే ధ్వని స్ఫురిస్తుంది.

లోహవిహంగం విప్లవవాది సృష్టించే పోరాటాన్ని సూచిస్తుంది.

సామ్యవాదాన్ని కోరే అతివాది పీడకవర్గాన్ని ద్వేషించక మానడు. ఈ ద్వేషమే 'భుజంగం'. దీన్ని కదిలించవద్దంటాడు మితవాది. వెక్కిరిస్తాడు అతివాది.

కదిలించుము సుప్తభుజంగాలను ఉంచకోయ్ మనోవల్మీకంలో అన్నది ధ్వని.

ఆధునిక చైతన్యం ఇద్దరు అంతర్జాతీయ తాత్త్వికుల వల్ల ప్రచారానికి వచ్చింది. మొదటివాడైన మార్క్సు చరిత్రకూ ప్రపంచానికీ నూతన భాష్యం రచించి మానవుడి మస్తిష్కంమీద ప్రభావం తెచ్చాడు. రెండవ వాడైన ఫ్రాయిడ్ మానవుడి ప్రవర్తనకు నూతన వ్యాఖ్యానంచేసి మానవుడి మనస్సుని ప్రభావితం చేశాడు. ఈ యిద్దరూ శ్రీశ్రీ దర్శనానికి మార్గదర్శకులు. మస్తిష్కాన్నీ మనస్సునీ (ఆలోచననీ ఆవేశాన్నీ) సమంగా తన కవిత్వంలో ప్రదర్శించాడు శ్రీశ్రీ. మస్తిష్కకులాయంలోని లోహవిహంగాలను ఎగిరించాలని చెప్పిన శ్రీశ్రీ మనోవల్మీకంలోని సుప్తభుజంగాలను కదిలించాలంటాడు. సుప్తభుజంగాలు సుప్తవాంఛలు మనోవల్మీకం I D.

ఛందోగీతానికీ వచన గీతానికీ మధ్యస్థంగా నిలిచే గీతం 'సాహసి'. 5 పాదాల ఈ గీతంలో మొదటి రెండు పాదాలూ అక్షరగణ సామ్యం గలవి. మధ్యనున్న మాటా తరువాతి రెండు పాదాలు విషమ పాదాలు. అందుకే ఇది ఛందో + వచన గీతం.

మొదటి రెండు పాదాలలో సస సభ అనే గణాలున్నాయి. ఇది తోటక వృత్తగమనం గలది. ఎగిరించకు లోహ విహంగములన్ అని మారిస్తే తోటకమే.

*36.* *'ఆ అవ్వే మరణిస్తే*
*ఆ పాపం ఎవ్వారిదని*
*వెర్రిగాలి ప్రశ్నిస్తూ*
*వెళిపోయింది!*
*ఎముక ముక్క కొరుక్కుంటు*
*ఏమీ అనలేదు కుక్క*
*ఒక ఈగను పడవేసుకు*
*తొందరగా తొలగె తొండ*
*క్రమ్మె చిమ్మచీకట్లూ*
*దుమ్మురేగె నంతలోన*
*'ఇది నా పాపం కా'దనె*
*ఎగిరివచ్చి ఎంగిలాకు* **1934**

'భిక్షువర్షీయసి' లోని అంతిమఘట్టం ఈ దిగ్భ్రాంతి కొలిపే వర్ణన.

ఈ లోకంలోని కష్టసుఖాలకు పూర్వజన్మలోని పాప పుణ్యాలు కారణాలని కర్మవాదం (వేదాంతం) వివరిస్తూంటే సమాజంలోని దోపిడీ— శ్రమ కారణాలని భౌతికవాదం వాదిస్తోంది. ఈ రెండు వాదాలనూ స్పృశించి భౌతిక వాదం వైపుకు సమాజాన్ని నడిపించడమే శ్రీశ్రీ దృక్పథం.

భిక్షువర్షీయసి జబ్బుచేసి పడిపోగా ఆ అవ్వే మరణిస్తే ఆ పాపం ఎవ్వారిదని ప్రశ్నించే వెర్రిగాలి భౌతికవాదికి ప్రతీకయే.

ఇది నా పాపం కాదని జవాబు చెప్పిన ఎంగిలాకు కర్మవాదికి ప్రతీక.

ఆ ఎంగిలాకు సమాజ శ్రమను దోచుకొని సుఖంగా భుజించిన పెట్టుబడిదారుడి ఎంగిలాకే. అతడే హేతువాదాన్ని తిరస్కరించి మత సిద్ధాంతాలను ఆశ్రయిస్తాడు. అవ్వ బిచ్చగత్తె కావడం, జబ్బు పడటం, తిండి దొరకక చనిపోవడం— వీటి కన్నిటికీ ఆమె పాపకర్మయే కారణం అంటాడు పెట్టుబడిదారు తాను సుఖపడటానికి తాను చేసుకున్న పుణ్యకర్మలే కారణం అంటాడు.

సామ్యవాది (భౌతికవాది) ఈ పాప పుణ్యాలను నిరాకరించి ప్రకృతిసంపదలను అనుభవించడానికి అందరికీ సమానమైన హక్కులున్నాయనీ ఎవరిశక్తికి

తగినట్లు వారు పనిచేసి ఎవరి అవసరానికి తగినట్లు వారు అనుభవించాలనీ సొంత ఆస్తి అనేది ఎవరికీ ఉండరాదనీ సమిష్టియాజమాన్యం రావాలనీ వాదిస్తాడు.

ఈ సామ్యవాదాన్నే శ్రీశ్రీ 'భిక్షువర్షీయసి' ద్వారా స్ఫురింపజేశాడు.

వెర్రిగాలివేసిన ప్రశ్నకు సమాధానం ఇవ్వడానికి కుక్కకుగానీ తొండకుగానీ ఖాళీ లేదు. ఆ ఖాళీ ఎంగిలాకుకు మాత్రమే ఉందనడంలో వ్యంగ్యం ఉంది.

ఎముకముక్క కొరుక్కునే కుక్క మాంసాహారమత్తుడైన ఒక బలవంతుడ్ని ప్రతిబింబిస్తుంది. బలవంతులు బలహీనులను ఏ విధంగా కొరుక్కు తింటారో ఈ పదచిత్రం సూచిస్తుంది.

ఒక ఈగను పడవేసుకు తొందరగా తొలగే తొండ అన్నం తినడంకన్నా అత్యవసరమైన వ్యాపారపు తొందరలున్న సంపన్నుడ్ని ప్రతిబింబిస్తుంది. ఎగిరి వచ్చిన ఎంగిలాకుకు అలాంటి తొందరలేవీ లేవు. అందుకే సమాధానం చెప్పింది. పీడకవర్గంలో కూడా తారతమ్యాలున్నాయి.

చిమ్మచీకటి క్రమ్మడం, దుమ్ము రేగడం నాటకీయమైన సంకేతాలుగా ముసల్దాని చావును సూచిస్తాయి.

ఎముక ముక్క కొరుక్కుంటు ఏమీ అనలేదు కుక్క అనే వాక్యంలో అంతఃప్రాస కర్కశధ్వనిని అనుభూతం చేస్తుంది.

వ్యావహారిక భాషలోని జీవశక్తిని ఆవిష్కరించి ఆధునిక జీవితానికి సాహిత్యాన్ని సన్నిహితం చేయడమే కాకుండా భాషాజీవశక్తిని సామాజిక చైతన్యానికి పరికరంగా వాడుకున్నాడు శ్రీ శ్రీ. శ్రీ శ్రీ వాక్యాలు, పదాలు వాడుక భాషనుంచి ఊడిపడ్డవే. అందువల్ల ఆబాలగోపాలానికీ శ్రీశ్రీ భాష అర్థం అవుతుంది. కానీ సిద్ధాంత అవగాహన అయితేనేకానీ శ్రీశ్రీ భావం అర్థంకాదు.

వెర్రిగాలి ప్రశ్నిస్తూ వెళిపోయింది—అన్నప్పుడు చివరిపాదంలోని కత్తిరింపు (Caesura) నిష్క్రమణకు వ్యంజకం. అలాగే వెళిపోయింది అనే విశాఖమాండలికం కూడా.

37\. *నిప్పులు చిమ్ముకుంటూ*
*నింగికి నే నెగిరిపోతే,*
*నిబిడాశ్చర్యంతో వీరు-*
*నెత్తురు క్రక్కుకుంటూ*
*నేలకు నే రాలిపోతే*
*నిర్దాక్షిణ్యంగా వీరె...* **(1935)**

ఆః అనే మినీకవిత ఇది. మహా ప్రస్థానంలో ఇంతకన్న లఘు కవిత లేదు. పరిమాణంలో పొట్టిదే కానీ దీని గుణాలు పుట్టెడు.

పీడితవర్గంలో ఒక సాహసి చేసిన పని ఈ ఖండికకు ప్రాతిపదిక. నిప్పులు చిమ్ముకుంటూ నింగి కెగిరిపోయాడు ఆ సాహసి. కానీ ఆ సాహసం ఫలించక పరాభూతుడయ్యాడు - పరాజితుడయ్యాడు. నెత్తురు క్రక్కుకుంటూ నేలకు రాలిపోవడమే ఆ పరాజయం !

పీడితుల విజృంభణను గానీ తిరుగుబాటును గానీ సాహసాన్ని గానీ బూర్జువాలు సహించలేరు.

ఇటువంటి బూర్జువాలే ఒక సాహసి నిప్పులు చిమ్ముకుంటూ నింగికి ఎగిరిపోతే నిబిడాశ్చర్యం పొందినవారు. సాహసి అపూర్వ చైతన్యాన్ని చూసి అద్భుతానుభవాన్ని పొందడంవల్ల ఆ శ్రామికుడి ఉన్నత శిఖరాధిరోహణం అంటే కిట్టక తాత్కాలికంగా అతడ్ని అభినందిస్తూ నటిస్తారు.

కానీ అతడు నెత్తురు క్రక్కుకుంటూ నేలకు రాలిపోతేమాత్రం అతడికి కలిగిన ఆపదను చూసి బాధపడరు. నిర్దాక్షిణ్యంగా అతడ్ని చూసి ఆః అలాగా పడిపోయాడా ! బాగా జరిగింది. నింగి కెందు కెగరడం, భూమి మీద పడి ఉండక ? అని అధిక్షేపిస్తారు, ఇక్కడే సాహసి పరాజితుడయ్యేది. బూర్జువాల కర్కశ హృదయ తత్త్వం ఈ సంఘటనలో వెల్లడయింది.

సాహసి ఆకాశాని కెగరడంలోనూ నేలకు రాలడంలోనూ శ్రీశ్రీ రెండు పోలికలను స్ఫురింపజేశాడు. ఈ పోలికలు వాచ్యంగాలేవు నిప్పులు చిమ్ముకుంటూ నింగి కెగరడం తారాజువ్వపని నెత్తురు క్రక్కుకుంటూ నేలకు రాలడం పక్షి పని. ఈ రెండింటిలోనూ మొదటిది స్వయంచోదిత క్రియ. కానీ రెండవది వేటగాని క్రూరత్వానికి ఫలితం వేటగాడు బాణం విసరకపోతే పక్షికి గాయం కాదు.

ఉపమానాన్ని స్ఫురింపజేయడం అలంకార వ్యంగ్యం. ఉత్తమ కావ్య లక్షణం.

ఆః లోవి రెండు త్రిపాది గీతాలు. ఈ రెండు గీతాలలోనూ పదాల సంఖ్య సమానం. పాదాల మాత్రల కొలతలు సమానం. వాక్యాలు ఒక మాదిరివే. మొదటి పాదం 11 మాత్రలు (4 + 3 + 4). రెండు మూడు పాదాలు 13 మాత్రలు. A B B అనే పద్ధతి.

రెండు గీతాలలోనూ పాదాది హల్‌సాదృశ్యం భావోద్దీపనకు పరికరం.

38. కవీ ! నీ గళ గళన్మంగళ
కళా కాహళ హళాహళిలో
కలసిపోతిని ! కరగిపోతిని !
కానరాకే కదలిపోతిని ! 1936

స్విన్‌బర్న్ శైలీవిశేషాలతోనే శ్రీశ్రీ స్విన్‌బర్న్‌ను స్తుతించాడు. స్విన్‌బర్న్‌తో శ్రీశ్రీ తాదాత్మ్యం పొందాడు. తనపై స్విన్‌బర్న్ ప్రభావాన్ని సూచించుకున్న గీతం ఈ ముత్యాలసరం.

స్విన్‌బర్న్ కళాకాహళను ఊదగా జనించిన హళాహళి (కల కల ధ్వని)లో శ్రీశ్రీ కలసిపోయాడు; ద్రవించిపోయాడు. అదృశ్యమైపోయాడు; చలించిపోయాడు. స్విన్‌బర్న్‌ది శబ్దనాద సుందరమూ శబ్ద సంఘటనా వైచిత్రీ మధురమూ అయిన కవిత్వం. శబ్దాలాధారంగా ఎంత ఇంద్రజాల ప్రదర్శనం చేయవచ్చునో అది అంతా స్విన్‌బర్న్ చేశాడు. దానిచేత శ్రీ శ్రీ గాఢంగా ప్రభావితుడయ్యాడు. ఆ శాబ్దిక ధ్వనిలో తాదాత్మ్యం అనుభవించి శబ్దశిల్పి అయిన స్విన్‌బర్న్‌ను శబ్దశిల్పంతో ప్రాసక్రీడలతో లయ విన్యాసంతో ఛందోనైపుణ్యంతో స్తుతించాడు.

కలిసిపోతిని కరిగిపోతిని కానరాకే కదలిపోతిని అనే పాదాల్లో ప్రతి పదాది యతి కూర్చడం పోతిని అనే క్రియను త్రిరావృత్తం చేయడం, నీగళ గళన్మంగళ -కాహళ హళాహళిలో అనే పాదాంశాలలో ముక్తపదగ్రస్తం కూర్చడం వంటివి ఛందస్సును మించిన అందాలకు చందాలు. ఇలాంటి సంవిధానాల్లో స్విన్‌బర్న్ శ్రీశ్రీకి గురుదేవుడే !

శ్రీశ్రీ కవిత్వం ఒక మహాసాగరం. అందులో తానొక నదిలా కానరాకే కదిలిపోయాడు- ఇది అలంకార ధ్వని.

స్విన్‌బర్న్ శబ్దక్రీడలను మించాడా శ్రీశ్రీ అనేందుకు నిదర్శనం అద్వైతం గేయం !

39. అలజడి మా జీవితం !
ఆందోళన మా ఊపిరి !
తిరుగుబాటు మా వేదాంతం ! 1937

శ్రీశ్రీ కమ్యూనిస్టు భావాలు నిర్దిష్టరేఖలతో కనిపించే ఖండికలలో వ్యత్యాసం ఒకటి. కార్మికవర్గం బూర్జువావర్గంతో చెప్పే ఈ మాటలు 'వ్యత్యాసం' లోనివే!

అలజడి, ఆందోళన అనేవి కార్మికవర్గంవారు తమ హక్కులను సాధించుకోవడానికో తాత్కాలిక సమస్యల పరిష్కారానికో వేతనాల పెంపునకో పని గంటల తగ్గింపునకో ధరల తగ్గింపునకో బోనసు కోసమో చేసే సమ్మెలు, ప్రదర్శనలు, కరపత్రాలు, కవితలు, ఊరేగింపులు, సభలు, బుర్రకథలు మొదలైన వాటిని సూచిస్తాయి.

కార్మికులకు అలజడియే జీవితం. ఆందోళనయే ప్రాణం. తిరుగుబాటే ఉపనిషత్తు. కూడు గూడు గుడ్డ అనే కనీసపు కోరికలు నెరవేరడానికై కార్మికులు అలజడినీ ఆందోళననీ తిరుగుబాటునీ చేస్తారు. తిరుగుబాటు బూర్జువాల మీదనే. వారి నిరంకుశ పాలననూ దోపిడినీ భరించలేకనే.

బూర్జువాల వేదాంతం పారలౌకికం. ఈ లోకంలో సుఖపడుతూ పరలోకంలో కూడా సుఖపడాలన్నదే వారి చూపు. మోక్షమే వారి వేదాంత ఫలం. కార్మికులకు ఈ లోకంలోనే సుఖం లేదు. భౌతిక వాదులు కనుక వారికి పరలోక భావనే లేదు. అందువల్ల వారికి కావలసిందల్లా జీవనదుఃఖాల నుంచి మోక్షమే. అందువల్ల వారి వేదాంతం తిరుగుబాటే.

ఈ మూడు వాక్యాలలో ఉన్న సాదృశ్యమే కవితా స్వరూపాన్ని నిలబెడుతుంది. మొదటి రెండు వాక్యాల్లో ఎనిమిదేసి అక్షరాలుండటంవల్ల అనుష్టుప్పు నడక వచ్చింది. మూడు వాక్యాల్లోనూ పదాల సంఖ్య సమానం. రెండవ వాక్యంలో తగణం లఘువూ వచ్చి లయను సిద్ధింపజేశాయి.

శ్రీశ్రీ వచన కవితకు వ్యత్యాసం ఒక ఉదాహరణ.

40\. *పాలికాపు నుదుటి చెమట*
*కూలివాని గుండె చెరువు*
*బిచ్చగాని కడుపు కరువు*
*మాయంటావూ?* **1937**

'మిథ్యావాది' లోని ఒక త్ర్యస్రగతి గీతం ఇది.

బ్రహ్మ సత్యం జగత్తు మిథ్య అనే వేదాంతిని భౌతికవాది సవాలు చేస్తున్నాడు. జగత్తు సత్యం బ్రహ్మ మిథ్య అంటాడు భౌతికవాది.

బూర్జువా వేదాంతాన్ని అభిమానిస్తాడు- తన స్థితికి అది రక్షణ కల్పిస్తుంది కనుక. కార్మికపక్షపాతి అయిన భౌతికవాది వేదాంతాన్ని తిరస్కరిస్తాడు- తన వర్గానికి అది బద్ధవిరోధి కనుక.

పాలికాపు ఫ్యూడల్ వ్యవస్థలోని పీడితుడు. కూలివాడు బూర్జువా వ్యవస్థలోని పీడితుడు. పాలికాపు నుదుటిచెమట అతని శ్రమస్వేదమే. ఆ ఘర్మజలానికి ఖరీదులేదు. కూలివాని గుండె చెరువుకు కారణం అతనికి జరిగే అన్యాయం. బిచ్చగాని కడుపు కరువుకు కారణం సమాజంలో కొందరిదే వర్ధించిన విస్తరి కావడం !

అసలు ఇవన్నీ మాయ అంటాడు వేదాంతి. ఈ వాదం సమస్యలకు పరిష్కారం కాదు. పైగా పలాయన వాదం. అన్నీ మాయ అనుకునే వేదాంతి కూడా ఆకలి నుంచి తప్పించుకోలేడు.

ఐశ్వర్యదారిద్ర్యాలకు కారణాలను అనేక విధాలుగా చెప్పవచ్చు. బూర్జువా వ్యవస్థయే కారణం అంటాడు భౌతికవాది. దాన్ని శాస్త్రీయంగా నిరూపిస్తాడు.

సంస్కృత భాషా వాసనను కూడా తగలనీయకుండా అచ్చ తెలుగు వాడటం శ్రీశ్రీ అక్కడక్కడ చేసే గమ్మత్తు. ఇందుకు అర్థసముద్దీపన దృష్టి ఉంది. పై గీతంలో మూడు పాదాలూ అచ్చ తెలుగే. అదే తగినదని అభిప్రాయం కావోలు.

**41.** *కావున—లోకపుటన్యాయాలూ*
*కాల్చే ఆకలి, కూల్చే వేదన,*
*దారిద్ర్యాలూ, దౌర్జన్యాలూ*
*పరిష్కరించే, బహిష్కరించే*
*బాటలు తీస్తూ*
*పాటలు వ్రాస్తూ*
*నాలో కదిలే నవ్యకవిత్వం*
*కార్మికలోకపు కల్యాణానికి*
*శ్రామికలోకపు సౌభాగ్యానికి*
*సమర్పణంగా—*
*సమర్చనంగా—* *1937*

తన కవితా వస్తువు, కవితా దృక్పథం, కవితా ప్రయోజనం, కవితా సంవిధానం ల గురించి శ్రీశ్రీ నిర్దేశించుకున్న సూత్రాలను 'ప్రతిజ్ఞ' ఖండికలో వెల్లడించాడు. ఆ ఖండికలోని కీలకమైన ప్రకటన పై గీతిభాగం.

బూర్జువావర్గం మీద కార్మికవర్గం విప్లవశంఖం పూరించినపుడు వర్గరహిత సమాజం ఏర్పడుతుంది. అంతవరకూ శక్తికి సమాజానికి సుఖశాంతు లుండవు. ఈ కీలకాన్ని తెలుసుకుని పీడితవర్గాన్ని విప్లవాభిముఖంగా చైతన్యవంతం చేయడానికే కవిత్వం రాయనారంభించిన తొలితెలుగు కవి శ్రీశ్రీయే !

లండన్ రచయితల ప్రణాళికను చదివి శ్రీశ్రీ 'ప్రొలిటేరియట్ కవి' గా మారాడు. అప్పుడే కార్మిక లోకపు కల్యాణానికీ శ్రామిక లోకపు సౌభాగ్యానికీ తన కవిత్వాన్ని అంకితం చేస్తున్నానని ప్రకటించాడు. ఇది శ్రీ శ్రీ నిబద్ధత. శ్రీశ్రీది శుద్ధ కవిత్వం కాదు; వ్యవహార కవిత్వం (Applied Poetry). ఇదే అభ్యుదయ కవిత్వం. (Progressive Poetry). తీవ్రతలోని తారతమ్యమే కానీ అభ్యుదయ - విప్లవ కవిత్వాలు మౌలికంగా ఒకటే. రెండింటికీ సామ్యవాద విప్లవమే లక్ష్యం. అభ్యుదయ కవిత్వం మధ్యతరగతి దాకానే వెళ్లింది. విప్లవకవిత్వం పీడిత వర్గందాకా వెళ్లడానికి యత్నిస్తోంది.

సామాజిక విప్లవానికి పురోగామిగా సాహిత్య విప్లవం సాగాలని శ్రీ శ్రీ అభిప్రాయం.

మారేదీ మార్పించేదీ మునుముందుకు సాగించేదీ నవ కవనానికి కావాలన్నప్పుడు కూడా శ్రీశ్రీ లక్ష్యం విప్లవమే.

లోకపు టన్యాయాలూ, కాల్చే ఆకలి, కూల్చేవేదన, దారిద్ర్యాలూ, దౌర్జన్యాలూ - వీటి కన్నింటికీ కారణం బూర్జువా పరిపాలనయే ! వీటిని పరిష్కరించడం, బహిష్కరించడం బూర్జువా పాలకులకు సాధ్యం కానిపని. కార్మికులే వాటిని తమ కార్మికవర్గ నియంతృత్వం ద్వారా బహిష్కరించ గలరు. అందువల్ల కార్మిక వర్గాన్ని పురికొల్పడమే కవి కర్తవ్యం. చిరకాలంగా కవులు పాలకవర్గం కోసం కవిత్వం రాశారు. శ్రీ శ్రీ పాలితవర్గం కోసం కవిత్వంరాస్తానని ప్రతిజ్ఞ చేశాడు. అలాంటి ఆశయం వల్లనే శ్రీ శ్రీ 'ప్రజాకవి' అయ్యాడు.

పరిష్కరించే - బహిష్కరించే ; బాటలు తీస్తూ - పాటలు వ్రాస్తూ; సమర్పణంగా - సమర్చనంగా వంటి పదవాక్య సాదృశ్యాలను సంఘటించడం ద్వారా శ్రోతను ఆకర్షించి, తబ్బిబ్బుపరచడంలో శ్రీ శ్రీ అద్వితీయ ప్రజ్ఞగల

వాడు. ఈ సంవిధానంలోని ఉదాత్తతవల్ల మధ్యతరగతి, పండిత రసజ్ఞులు ఆకర్షింప బడినంతగా ప్రజలు కాలేరు. అందువల్ల శ్రీ శ్రీ 'పండితకవి' కూడా అయ్యాడు.

***42.*** *నా విన్నవి కన్నవి విన్నవించగా*
*మాటలకై వెదుకాడగ బోతే—*
*అవి*
*పుంఖానుపుంఖంగా*
*శ్మశానాలవంటి నిఘంటువులు దాటి,*
*వ్యాకరణాల సంకెళ్లు విడిచి,*
*ఛందస్సుల సర్పపరిష్వంగం వదలి—*
*వడిగా, వడివడిగా*
*వెలువడినై, పరుగిడినై, నాయెదనడుగిడినై!* ***1937***

కవితా ఓ కవితా అనే వచన గీతంలో శ్రీశ్రీ చిరదీక్షా శిక్షా తపస్సమీక్షణలో నిశ్చల సమాధిలో స్వర్గద్వారపు తోరణమై వ్రేలిన మస్తిష్కంలో తనకు కొన్ని భాషలు, ఘోషలు దృశ్యాలు తోచాయంటూ వాటిని ఉదాహరించిన తరువాత ఇలా అన్నాడు:

ఈ మాటలు శ్రీశ్రీ అంటున్నవి కవితా జననితోనే! పాలక వర్గం కోసం కవిత్వం రాసిన కవులెవరూ వినని ఘోషల్నీ కనని దృశ్యాల్నీ పాలిత వర్గం కోసం కవిత్వం రాయదలచిన శ్రీశ్రీ విన్నాడు; కన్నాడు. అవన్నీ సమాజ వాస్తవ ధ్వనులూ దృశ్యాలూను. (వ్యథార్త జీవిత యథార్థ దృశ్యాలు)

కాలాంతరాలి మనః ప్రపంచపు టావర్తాలు, శిశువు చిత్రనిద్రలో ప్రాచీన స్మృతులూపే చప్పుడు, రోగార్తుని రక్తనాళ సంస్పందన, త్రాగుబోతు వ్యక్తావ్యక్తాలాపన, పడుపుకత్తె భయంకర బాధలు, ఉరితీయబడ్డ శిరస్సు చెప్పిన రహస్యం, ఉన్మాది కేకలు, కూలీల ఆర్తారావం వంటి వాటిని "విన్నానమ్మా విన్నానెన్నో విన్నా" నంటూ చెప్పుకున్నాడు. ఇవన్నీ కవితను స్మరిస్తే అతని కగుపించే దృశ్యాలూ భాష్యాలూను. ఏ కవికైనా ముందు దర్శనం ఉండాలి. **తరువాత** సృజనం (ప్రదర్శనం) చేయాలి.

ఈ సృజనకు కవికి కావలసిన పరికరాలే మాటలు ఈ మాటలు నిఘంటువుల్లో ఇమిడి ఉంటాయి. వాటికి కవి తన సృజనశక్తి వల్ల ప్రాణం పోస్తాడు.

అందుకు ప్రజా వ్యవహారం అతనికి ప్రమాణం. నిఘంటువులలో ఉండే అర్థాలు పాతవే. ఆ మాటలను లక్ష్యార్థాల్లోనూ వ్యంగ్యార్థాల్లోనూ కవి వాడితేనే వాటికి ప్రాణం వస్తుంది

కవుల ప్రయోగాల ననుసరించిన అర్థాలను చెప్పిన నిఘంటువులు శ్రీశ్రీకి శ్మశాన ప్రాయాలుగా కనిపించాయి. అందులోని మాటలు శవప్రాయాలు. తాను వాటికి ప్రాణం పోయదలచగా అవి తన దగ్గరకు వచ్చాయంటాడు. మాటల కున్న పాత అర్థాలు ఫ్యూడల్ వ్యవస్థలో పాలకవర్గ కవులు వాడగా ఏర్పడినవి. తాను ప్రజా కవి కనుక ఆ మాటలను నవ్యార్థాలలో వాడతాడు.

మాటల స్వరూపాన్నీ బాగోగుల్నీ నిర్ణయించి వ్యాకరణం వాటికి నియమాలను ఏర్పరిచింది. అవే సంకెళ్లు. ఈ సంకెళ్లు స్వేచ్ఛకు అవరోధకాలు. తాను వ్యవహారిక భాషలో రాసే కవిత్వానికి పాత పద్ధతి వాక్యరచన, పదరూపాలు పనికిరావు. అందువల్ల మాటలే వ్యాకరణాల సంకెళ్లు విడిచి తనదగ్గరకు వచ్చాయని చమత్కరించాడు.

ఛందస్సులు మాటల కూర్పులో లయను, గమనాన్ని ప్రసాదిస్తాయి. అవి కూడా పాతబడిపోయాయి. తాను వ్రాస్తున్న కవిత్వం 'కదిలేదీ కదిలించేదీ పాడేదీ పాడించేదీ మునుముందుకు సాగించేదీ' కనుక ఆ పాత ఛందస్సులు పనికిరావు. పాత ఛందస్సులు (గణబద్ధాలు) సర్పపరిష్వంగాలవలె మాటలను కదలనీయవు. మాత్రాబద్ధాలయిన నూతన ఛందస్సులను తా నేరుకున్నాడు. వాటికోసం మాటలు పరుగెత్తుకు వచ్చాయని చమత్కరించాడు.

అర్థాలను నిర్ణయించే నిఘంటువు, భాషాలక్షణాన్ని శాసించే వ్యాకరణం, రీతిని తెల్పే ఛందస్సు మారిన కవిత్వానికి పనికి రాకపోవడం వల్ల వాటినింకా విస్తృతం చేయవలసివచ్చింది. ఎక్కువ స్వాతంత్ర్యం తీసుకోవలసి వచ్చింది. ఈస్వాతంత్ర్యం ఒకరిస్తే లభించేది కాదు. తిరుగుబాటు చేసి కళాకారుడు తనంత తానే తీసుకుంటాడు. ఇలా తీసుకోవడానికి అతనికి సంప్రదాయ పరిజ్ఞానం, చొరవ, ప్రయోగ కౌశలం, అభ్యాసపరిణతి ఉండాలి. శ్రీశ్రీకి ఈ అర్హతలన్నీ ఉన్నాయి. తన కవిత్వమే నూతన నిఘంటువుకీ, నూతన వ్యాకరణానికీ, నూతన చ్ఛందస్సుకీ లక్ష్యం అయ్యేటట్లు చేశాడు శ్రీశ్రీ.

నిఘంట్వర్థాలను శ్రీశ్రీ తిరస్కరించి నూతనార్థాలలో మాటలను వాడాడా? ఆఁ ఎన్నో వాడాడు—మనస్సినీవాలి, నాద బ్రహ్మపు *పరిచుంబన*, *ధర్మజలం*, ఇలా తలంలో *హేమం* పిండగ మొదలైనవి.

వ్యాకరణాల సంకెళ్ళ నుంచి మాటలను విడిపించాడా ? ఆఁ విడిపించాడు. వెలువడినై, వెళిపోయింది, నీ వేపే వంటి వాటిని పాత వ్యాకరణం అంగీకరించదు.

ఛందస్సుల సర్పపరిష్వంగం నుంచి మాటలను విడిపించాడా ? అంటే అందుకు మహాప్రస్థానం గీతాలే సమాధానాలు. అవి ఛందస్సు నుంచి లయకు కాకుండా లయ నుంచి ఛందస్సుకు సాగిన ప్రస్థానాలు.

*43.* *ఘూటెక్కిన గంధకధూమం*
*పోటెత్తిన సప్తసముద్రాల్*
*రగులుకొనే రాక్షసిబొగ్గూ*
*బుగులుకొనే బుక్కాగుండా*
*వికసించిన విద్యుత్తేజం*
*చెలరేగిన జనసమ్మర్దం*
*కావాలోయ్ నవకవనానికి!* *1937*

నవకవితా సామగ్రినీ రసాలనూ ధ్యేయాలనూ ప్రతీకలతో పదచిత్రాలతో సూచించిన శ్రీశ్రీ ఖండిక 'నవకవిత'. శ్రీశ్రీ నవకవిత భావకవితకు పూర్తిగా విరుద్ధం. 'నవకవిత'లోని రెండవ గీతం ప్రస్తుతం మనం సమాలోచిస్తున్నది.

ఈ నవకవితా సామగ్రి సంక్షోభాన్ని ఉద్రేకాన్ని వేడిమినీ వ్యక్తం చేస్తోంది. ఇవన్నీ భయానక రసాన్ని సూచిస్తున్నాయి. 'భయం' ఈ రసానికి స్థాయి భావం.

ప్రస్తుత ప్రపంచం క్షుధార్తులతో సంగ్రామ పీడితులతో దారిద్ర్య బాధితులతో అల్లకల్లోలంగా ఉంది. ప్రపంచమింత సంక్షోభంలో ఉండగా కవులు దంతప్రాకారాలమీదా స్వప్నసీమలలోనూ ఉండకూడదు. వాస్తవికతకు కవిత దర్పణం కావాలి. ప్రయోజనదాయి కావాలి. సామ్యవాద విప్లవ చైతన్యమే ఆ ప్రయోజనం.

ఘూటెక్కిన గంధకధూమం వేడిమినీ ఉద్రేకాన్ని సూచిస్తుంది. పోటెత్తిన సప్త సముద్రాలు సంక్షోభానికి సూచికలు. రగులుకొనే రాక్షసి బొగ్గు పారిశ్రామిక విప్లవానికీ యంత్రచలనానికీ ప్రతీక. యంత్రాలమీద శ్రామికుల శ్రమమీద పెట్టుబడిదారుల దోపిడి ఆధారపడి ఉంటుంది. బుగులుకొనే బుక్కా

గుండ ప్రపంచంలో జరుగుతున్న మోసాలను (వెనుకదగా ముందుగా) వ్యక్తం చేస్తుంది. వికసించిన విద్యుత్తేజం పారిశ్రామిక యుగ చైతన్యానికి ప్రతీక. జనసమ్మర్దం చెలరేగడం అశాంతినీ తిరుగుబాటునీ సూచిస్తుంది.

నవకవిత ప్రజల ఉద్రేకం, సంక్షోభం, అశాంతి, తిరుగుబాటు మొదలైన వాటిని చిత్రించాలనీ పారిశ్రామిక విప్లవాన్ని బూర్జువాల దోపిడీనీ దగానీ ఖండించాలనీ అజ్ఞానాన్నీ జడత్వాన్నీ మూఢ విశ్వాసాలనూ పరిహసించాలనీ అభిప్రాయం.

ఈ గీతానికి పల్లవితో కలసి 7 పాదాలు. ప్రతి పాదానికీ 14 మాత్రలు. 6 మాత్రలమీద పద విశ్రాంతి. పాదాంతంలో పద విరామం. ఈ పాదాలలో కందపద్యం నడక కూడా ఉంది.

ఘూటెక్కిన గంధకధూ
మంపోటెత్తిన సప్తసముద్రాల్ రగులుకొ
నే రాక్షసి బొగ్గూ బుగు
లుకొనే బుకాగుండా వికసించిన విద్యుత్

ఈ గీతంలోని పాదాలన్నీ ఒకే విధమైన భాషా భాగాలతో మొదలు కావడంవల్ల లయ యేర్పడింది. ఘూటెక్కిన-పోటెత్తిన- రగులుకొనే-బుగులుకొనే-వికసించిన-చెలరేగిన-ఇవన్నీ క్రియాజన్య విశేషణాలు. ఈ పాదాల్లో ప్రతిరెండు పాదాలకూ మొదటి ఆరు మాత్రలకూ గురు లఘు సాదృశ్యం పాటించబడింది.

*44.* నైలునదీ నాగరికతలో
సామాన్యుని జీవన మెట్టిది ?
తాజమహల్ నిర్మాణానికి
రాళ్ళెత్తిన కూలీ లెవ్వారు ?
సామ్రాజ్యపు దండయాత్రలో
సామాన్యుల సాహస మెట్టిది ?
ప్రభువెక్కిన పల్లకి కాదోయ్
అది మోసిన బోయీలెవ్వారు ? *1938*

చారిత్రక భౌతిక వాదం వల్ల నూతన దృక్పథంతో చరిత్రను చదువుకున్న శ్రీశ్రీ గతానుగతిక చరిత్రకారులమీద తిరగబడి వేసిన సూటిప్రశ్నలివి-దేశ చరిత్రలు ఖండికలోవి. పాలకవర్గాన్ని సమర్థిస్తూ కీర్తిస్తూ సాహిత్యంలాగే

చరిత్ర కూడా రచింపబడిందింతవరకూ. పాలిత వర్గమే నిజానికి చరిత్రను సృష్టిస్తుంది. కానీ ఆ చారిత్రక యధార్థతత్త్వం ముసుగులో పడిపోయింది. మార్క్సిజం దాన్ని బయటికి తీసింది. చల్లారిన సంసారాలూ మరణించిన జన సందోహం అసహాయుల హాహాకారం చరిత్రలో మూలుగుతున్నవనీ వీటిని గురించి చరిత్రకారు లెవరూ రాయకపోవడం అన్యాయం అనీ విమర్శించింది.

ఏ యుద్ధం ఎందుకు జరిగెనో? ఏరాజ్యం ఎన్నాళ్లుందో తారీఖులు దస్తా వేజులు ఈ రాణీ ప్రేమ పురాణం ఆ ముట్టడికైన ఖర్చులూ మతలబులూ కైఫీయతులూ వంటివే చరిత్రలో కనిపిస్తున్నాయి. ఇవి చరిత్ర నన్వర్థం చేయవు. చరిత్రసారాన్ని అందించవు.

చరిత్రకు లక్ష్యం ''ఇతిహాసపు చీకటి కోణం అట్టడుగునపడి కాన్పించని కథలు - దాచేస్తే దాగని సత్యాలూ చారిత్రక విభాత సంధ్యల్లో మానవ కథ వికాసం, ఆయా దేశాలు భిన్న యుగాల్లో సాధించిన పరమార్థాలూ అయి ఉండా లంటూ ఈ ప్రశ్నలు వేశాడు శ్రీశ్రీ.

మానవజాతి తొలి నాగరిక సమాజం అవతరించిన ప్రాంతాల్లో ఈజిప్టు లోని నైలునదీ తీరాలొకటి. వ్యవసాయం విస్తరించడంతో అక్కడ నూతన సమాజ వ్యవస్థ ఆవిర్భవించింది. ఉత్పత్తి పెరిగి సంపదలు విస్తరించడమే నాగరికతకు తొలిమెట్టు. ఈ నాగరికతను వర్ణించే చరిత్రకారుడు సామాన్యుని జీవన విధానాన్ని గురించి చెప్పడంలో ఉపేక్ష వహించాడు. సామాన్యుల శ్రమలేకుండా ఆ నాగరికత ఎలా వికసించింది?

షాజహాన్, ముంతాజ మహల్‌ల ప్రణయగాథకుండే ప్రాధాన్యం చరిత్రలో తాజమహల్ నిర్మాణానికి రాళ్ళెత్తిన కూలీలకు కనిపించదు. అంటే ఆ కూలీల పేర్లు చెప్పాలనికాదు. వారి జీవన విధానం ఎలా ఉండేది? కళాఖండాల నిర్మాణం కూలీల శ్రమ లేకుండా జరుగదు. ఆశ్రమకు తగిన ప్రతిఫలం వారికి దక్కిందా? లేక దోపిడి జరిగిందా?

సామ్రాజ్య విస్తరణ కాంక్షతో ప్రభువులు చేసిన దండయాత్రలలో సామాన్యులు సైనికులుగా పాల్గొన్నారు. వారి పాత్రను గురించి ఏ చరిత్ర కారుడూ వ్రాయనే లేదు. అందుకే సామ్రాజ్యపు దండయాత్రలో సామాన్యుని సాహస మెట్టిది ? అని ప్రశ్నించాడు.

ఆ ప్రభువులే పల్లకీ లెక్కి ఊరేగడం వంటి భోగాలను 'జన్మహక్కు' గా అనుభవించారు. అటువంటి భోగానుభవాలను కలిగించినవారు బోయీలు—వారు సామాన్యులే. పల్లకి మోయడం బరువు మోయడానికొక ప్రతీక మాత్రమే.

ఈ విధంగా గత చరిత్రలోని లోపాలను దిఙ్మాత్రంగా ప్రదర్శించడం ద్వారా వర్తమాన భవిష్యచ్చరిత రచనాపరాయణులకు ఒక సందేశం ఇవ్వడం శ్రీశ్రీ విమర్శకు లక్ష్యం. గత చరిత్రను కూడా ఈ దృక్పథంతో తిరిగి రచించుకోవాలని సూచన.

45. *ఊరవతల నీరింకిన*
*చెరువు పక్క, చెట్టునీడ—*
*గోనెలతో, కుండలతో*
*ఎటు చూస్తే అటు చీకటి*
*అటు దుఃఖం, పటు నిరాశ—*
*చెరసాలలు, ఉరికొయ్యలు,*
*కాలువలో ఆత్మహత్య*
*దగాపడిన తమ్ములార!*
*మీ బాధలు నే నెరుగుదును!*
*వడలో, కడు*
*జడిలో, పెను*
*చలిలో తెగనవసి కుములు*
*మీ బాధలు, మీ గాథలు*
*అవగాహన నా కవుతాయి!*
*పతితులార!*
*భ్రష్టులార!*
*దగాపడిన తమ్ములార!*
*మీ కోసం కలం పట్టి*
*ఆకాశపు దారులంట*
*అడావుడిగ వెళిపోయే*
*అరుచుకుంటు వెళిపోయే*
*జగన్నాథుని రథ చక్రాల్*
*రథచక్ర ప్రళయ ఘోష*

భూ మార్గం పట్టిస్తాను !
భూ కంపం పుట్టిస్తాను ! **1940**

శ్రీశ్రీ రచించిన విప్లవగీతాలలో 'జగన్నాథుని రథచక్రాలు' ప్రసిద్ధ మయింది. అందులోనిదే ఈ ఓదార్పు-ఈ ప్రతిజ్ఞ.

ఆకాశమార్గంలో వెళ్లిపోతున్న జగన్నాథుని రథ చక్రాలను శ్రీశ్రీ తన కవిత్వంతో నేల మీదికి రప్పిస్తాడట. అవి కిందికి దిగేటట్లు చేసి భూమిని కంపింప జేస్తాడట.

తాను పీడిత జగన్నాథుడు-అంటే విప్లవ నాయకుడు. సమాజంలో బూర్జువాల దోపిడికి గురి అవుతున్న పతితుల్నీ భ్రష్టుల్నీ ఏడవకండని ఓదారుస్తూ వారిని ముందుకు నడిపిస్తాడు. వారికి రాజ్యం అప్పగిస్తాడు. శ్రీశ్రీ ఇంత ఆశావాది. సామ్యవాద ప్రపంచ స్వాప్నికుడు.

భవిష్యత్తు, కవిత్వం, విప్లవం-మూడూ శ్రీశ్రీకి ఒక లాటివే. ఈ మూడింటికీ జగన్నాథ రథ చక్రాలు ప్రతీకలే!

పీడితులు పడుతున్న ఇక్కట్లను పరామర్శించి వారికి అభయం పలకడం ఉదాహృత భాగంలోని విషయం. పీడితులకు లోగిళ్లు లేవు (బూర్జువాలకున్నాయి). బట్టలు లేవు; వంట పాత్రలు లేవు. మరి వారెక్కడున్నారు ? ఊరవతల - నీరింకిన చెరువుపక్క చెట్టునీడలోనే !

వారి సంసార మేమిటి ? గోనెలూ కుండలూను. వారి బాధలెలాంటివి ? ఎటుచూస్తే అటు చీకటి అటు దుఃఖం-పటునిరాశ! చెరసాలలు, ఉరికొయ్యలు, కాలువలో ఆత్మహత్య.

ఈ విధంగా ఒక్కొక్క మాటలో ఒక పెద్ద భావాన్ని ఆవిష్కరించడం శ్రీ శ్రీ శిల్పం.

పీడితులలో కొందరు పాలకవర్గం దృష్టిలో నేరంచేసినవారు. అందువల్లనే వీరికి శిక్షలు పడ్డాయి. వీరంతా కవి పరిభాషలో దగాపడిన తమ్ములు. వీరి బాధలు శ్రీశ్రీకి బాగా తెలుసు. వీరంటే ఆయనకు జాలి. అందుకే మీ బాధలు నేనెరుగుదును, మీ బాధలు మీ గాథలు అవగాహన నాకవుతాయి అంటాడు.

వేసవికాలపు ఎండల్లో వర్షాకాలపు జడివానల్లో చలికాలపు పెనుచలిలో వారు కుమిలిపోయారు. దీన్నే 'వడలో కడుజడిలో పెనుచలిలో తెగనవసి కుములడం' గా వర్ణించాడు శ్రీ శ్రీ. ఇవి కూడులేని గూడులేని భిక్షుల, పక్షుల బాధలు. (చూ. జయభేరి).

కవితా ఓ కవితా, ప్రతిజ్ఞ, బాటసారి, భిక్షువర్షీయసి, ఉన్మాది, చేదుపాట, సంధ్యాసమస్యలు, పరాజితులు, దేశ చరిత్రలు, వాడు, వ్యత్యాసం వంటి ఖండి కలనిండా పీడితుల బాధలే సూచింపబడ్డాయి.

ఈ దగాపడ్డ తమ్ముళ్ల నుద్ధరించడానికి శ్రీశ్రీ చేయగలిగిందేమిటి ? తన కవిత్వంతో మరో ప్రపంచాన్ని భూమిమీదికి అవతరింపజేయడం ; సామ్యవాదం అనేది ఒక ఆశయం ! స్వప్నం ! దాన్ని వాస్తవంగా రూపొందించాలి. ఇందుకు విప్లవం రావాలి. ఈ విప్లవాన్నే శ్రీ శ్రీ రప్పిస్తాడు.

ఆకాశపు దారులంట హడావుడిగ వెళిపోయే జగన్నాథుని రథచక్రాలను భూమార్గానికి పట్టిస్తాననీ రథచక్ర ప్రళయఘోషలో భూకంపం పుట్టిస్తాననీ ప్రతిజ్ఞ చేశాడు. భూకంపం అనే మాటతో విప్లవాన్నీ భూమార్గం అనే మాటతో శ్రామిక జన జీవనాన్నీ స్ఫురింపచాడు. పీడితులే విప్లవ శంఖం పూరిస్తారు ; వారికి ఆ ధైర్యాన్ని తాను నూరిపోస్తాడు.

పడలో కడుజడిలో పెనుచలిలో అనే కూర్పులో డకారావృత్తి, విభక్తి పునరావృత్తి, హ్రస్వాక్షర బాహుళ్యక లయప్రదాలు.

గీతమంతా త్ర్యస్రగతిలో ఉన్న మాత్రాగణాలు మాత్రం అరేసి మాత్ర లకే విరుగుతూ వేగంగా పరుగెడుతాయి. వేగం శ్రీశ్రీ శైలికి ప్రాణం. ఇది శ్రీశ్రీ ఆవేశాన్ని నిరూపిస్తుంది. ఈ ఆవేశానికి ఆలోచన పునాదిగా ఉంటుంది.

**46.** *గర్జించు రష్యా !*
*గాండ్రించు రష్యా !*
*పర్జన్య శంఖం పలికించు రష్యా !* **1941**

జగన్నాథుని రథచక్రాలు రచించేనాటికి రెండవ ప్రపంచయుద్ధం జరుగు తోంది. ఆ యుద్ధం సామ్రాజ్యవాదానికి విలయం తెస్తుందని శ్రీశ్రీ భావించి తన భావనను ఆ గీతంలో వ్యక్తం చేశాడు. 1941 జూన్ 22వ తేదీన నాజీ నియంత హిట్లర్ సామ్యవాద దేశమైన రష్యామీద విరుచుకుపడ్డపుడు సోవియట్లు ఆ దాడిని గట్టిగానే ఎదుర్కొన్నారు. పత్రికల్లో వచ్చిన ఆ వార్తను వినగానే శ్రీశ్రీ ఎగిరి గంతువేస్తూ రచించిన గేయమే గర్జించు రష్యా ! రష్యాకు సంబోధన గీతం (ODE to Russia) ఇది ! ఇటువంటి గీతం తెలుగులో రావడం ఇదే మొదలు.

గర్జించు రష్యా ! గాండ్రించు రష్యా అనే సంబోధనలోని క్రియలు విచిత్రార్థ స్ఫోరకాలు. గర్జించేది సింహం. గాండ్రించేది పెద్దపులి. హిట్లర్

సేనలపాలిటికి రష్యా సింహ శార్దూలాలవలె కనిపించాలని శ్రీశ్రీ హెచ్చరిక. సామ్రాజ్యవాది అయిన హిట్లర్ సామ్యవాదానికి బద్ధశత్రువు. ఆ శత్రువును క్షమిస్తే ప్రపంచంలో సామ్యవాద ధర్మమే నామరూపాలు లేకుండా పోతుంది. ఇక్కడ దౌర్జన్యానికి దౌర్జన్యమే మందు.

శ్రీశ్రీ అలంకార వ్యంగం సాధించిన సందర్భం ఇది.

పర్జన్యశంఖం పలికించడం అనేది అతినవ్యమైన భావచిత్రం. పర్జన్యం, శంఖం రెండూ అప్రధానాలే రెండూ గాంభీర్యం గల వాదానికి సంకేతాలు; కవి సమయాలు. పర్జన్యం వలెనూ శంఖంవలెనూ మ్రోగవలసింది రష్యా కంఠం. రష్యాకుగల ఉత్సాహం (వీరం), ఉద్వేగం మొదలైన భావాలు వ్యంగ్యాలు. మేఘంవలె గర్జించడం శంఖం ఊది యుద్ధానికి ఆహ్వానించడం మన సాహిత్య వర్ణన సంప్రదాయాలు. వాటిని నూత్న రీతిలో మేళవించి, రెండింటి వల్లనూ గమ్యమయ్యే అర్థవైచిత్రులను ఏకత్ర ప్రదర్శించాడు శ్రీశ్రీ.

ఛందస్సమ్మిశ్రణం ఇందులోని ఛందోవైచిత్రి. మొదటి రెండు పాదాల్లో 5+4+5+4 మాత్రల మిశ్రగతి ఉంది. ఇది విలక్షణమే.

* * *

**47.** Sigmund Freud, Herold Lloyd
Albert Einstein, Jacob Epstein
*హరీన్ ఛట్టో, గిరాంమూర్తి*
*ఇటీవల మా* inspiration **1940?**

'రుబాయత్' అనే అధివాస్తవిక రచనలో ఒక రుబాయీ ఇది. తన తరం వారికి inspiration ను కలిగించిన వ్యక్తులను పేర్కొనడం ద్వారా ఉమర్ ఖయ్యాంను అధివాస్తవిక సంవిధానంతో అనుకరించాడు శ్రీశ్రీ.

పైకి కేటలాగు రచనలా కనిపిస్తుందిది. గణబద్ధం చేసి, లయ కల్పించి, కొన్ని పేర్లను పేర్చి జ్ఞాపకం ఉంచుకోవడాని కనువుగా చేశాడు దీన్ని.

గతాన్ని పట్టుకు వేలాడటం ప్రగతి వాది లక్షణం కాదు. ఇటీవల మా inspiration అనడం గతాన్ని inspiration గా తీసుకునే వారి మీద ధ్వజారోహణమే.

సైకో ఎనాలిసిస్ సిద్ధాంతం కనిపెట్టిన ఆస్ట్రియావాడు ఫ్రాయిడ్ (1856). సాపేక్ష సిద్ధాంతం కనిపెట్టిన జర్మనీవాడు ఐన్ స్టీన్ (1879) విప్లవ కవిత్వం

రాసిన బెంగాలీ వాడు హరీంద్రనాథ ఛటోపాధ్యాయ (1898). వ్యావహారిక భాషా విప్లవకారుడైన తెలుగువాడు గిడుగు రామమూర్తి (1863). అమెరికన్ హాస్యనటుడు హెరాల్డ్ లాయిడ్ (18?4). అమెరికన్ శిల్పి జాకబ్ ఎప్స్టీన్ (1880).

హరీన్ ఛట్టో, గిరాం మూర్తి అని పేర్లను పొట్టి చేయడంలో హాస్య గౌరవం ఉంది. శ్రీశ్రీ విదూషకత్వం ఇది.

పదజాలం ఆంగ్ల మైనపుడు రోమన్ లిపిలోనే వ్రాయడం నూత్నవైచిత్రి.

మొదటి రెండు పాదాలు చతురస్రగతిలో నడిస్తే చివరి రెండు పాదాలూ (ముత్యాలసరం) మిశ్రగతిలో నడుస్తాయి.

గిడుగు రామమూర్తికి హ్రస్వనామం గిరామూర్తియే. కానీ గిరాంమూర్తి అనడం సార్థకం. గిరాం అంటే మాటలయొక్క అని అర్థం. ఏ విశ్వవిద్యాలయమూ ఆయనకివ్వలేని బిరుదుని శ్రీశ్రీ ఇచ్చాడాయనకు.

*48.* *కాకికేమితెలుసు Psycho-Analysis ?*

*ఆటవెలది ద్విపద కర్తగారు*
*5,3,2 అముక్తమాల్యద*
*విశ్వదాభిరామ వినురవేమ !*
*(పాఠాంతరం: దీని భావమేమి తిరుమలేశ)* *1940?*

శ్రీశ్రీ అధివాస్తవిక కవితల లోంచి ఒక మచ్చుతునక ఇది. De-Compositions లో ఒకటి

అధివాస్తవిక శ్రీశ్రీ హేతుబద్ధమైన భావనను సన్యసించాడు. వ్యక్తావ్యక్త మానసంయొక్క స్పందనను విశృంఖలంగా ఆవిష్కరించాడు. సంప్రదాయావహేళనకు అధివాస్తవికతను ఆశ్రయించాడు. అభ్యుదయ కవిత్వం నుంచి వికట కవిత్వంలోకి లంఘించాడు.

ఎద్దుపుండు కాకికేమి తెలుసు అను సామెతకు పేరడీగా కాకికేమి తెలుసు సైకో ఎనాలిసిస్ అనే పంక్తి ఆవిర్భవించింది. ఇది కూడా ఒక హాస్యపు సామెతే. కాకి ఎందరో మూర్ఖులకు సంకేతం. వాచాలుడు, ఎంగిళ్లు తినేవాడు, ఒంటికంటివాడు, సమగ్ర దర్శనం లేనివాడు కాకి వంటివాడే. సైకోఎనాలిసిస్ (మనోవిశ్లేషణ) ఫ్రాయిడ్ సిద్ధాంతం. దీని ఆధారంతోనే అధి వాస్తవికత రూపొందింది.

ఆటవెలది ద్విపదక త్తగారు అని ఆటవెలదికీ ద్విపదకూ వావివరసలు చెప్పడం నవ్వు కలిగిస్తుంది. ఆటవెలది పద్యానికి పాదాలు నాలుగు ద్విపదకు రెండే పాదాలు. అందువల్ల ద్విపదకన్నా ఆటవెలది ఘనమైనది. ద్విపద కోడలైతే ఆటవెలది అత్తగారు. ఆటవెలదికున్న వ్యంగ్యార్థం వేశ్య.

5,3,2 ఆముక్తమాల్యద అనే పాదంలో అక్షరాలకు బదులు అంకెలు వాడటం వినోదక్రీడ. 5,3,2 అనేది ఒక పేకాట పేరు. ఆంధ్ర కవిత్వం ఆముక్త మాల్యద దగ్గర నారికేళ పాకంగా మారిపోయింది. ఈ స్థాయీ పతనం అంకెల అవరోహణ. క్రమం ద్వారా సూచింపబడుతోందా?

అధివాస్తవికతకు అర్థాలు చెప్పడం కన్నా అనుభవించడమే ముఖ్యం.

ప్రాచీన కావ్యాల తాళ పత్రాలలోని పాఠాంతరాలను అవహేళన చేస్తూ విశ్వదాభిరామ వినురవేమ అనే దానికి దీని భావమేమి తిరుమలేశ అని కుండలీ కరణంలో సూచించాడు పాఠాంతరంగా.

ఈ పద్యంలో భావం తిరుమలేశుడికే తెలియాలి సుమా అని హెచ్చరిక ఇది. అంటే భావం కోసం శ్రమపడవద్దనే కదా !

ఒక ఆంగ్ల పదబంధానికి తెలుగులో గణాలను సరిపెట్టుకుని, ఆ పద బంధాన్ని ఆంగ్లలిపిలోనే లిఖించడం శ్రీశ్రీ అధివాస్తవిక ప్రయోగం (Expeniment).

ఆట వెలది పద్యంలో ఆటవెలది అనే మాటను వాడి ముద్రాలంకార మర్యాద పాటించాడు.

గణాలనేవి అక్షరాలకుంటాయి కానీ అంకెల కుండవు. అంకెలకు కూడా గణాలను కూర్చడం విచిత్రం. 5, 3, 2 ఆముక్త మాల్యద = ఐదు మూడు రెండు ఆముక్త మాల్యద అని అక్షరీకరించుకోవాలి మనం. ఇదొక రకమైన చిత్ర కవిత్వం.

49. *ఛందో బంధోబస్తులన్నీ*
*ఫట్ ! ఫట్ ఫట్ మని త్రెంచి*
Damn it ! *ఏమిట్రా ఇదంటే*
Pray ! it's Poetry *అందాం ?* **1940**

'కొంటె కోణాలు' అనే అధివాస్తవిక కవితకు ఆరంభం ఇది. లోకాచారాలకు సంప్రదాయాలకు కవి సమయాలకు సభ్యతకు నాగరికతకు విరుద్ధంగా ప్రవర్తించడం ద్వారా ఆశ్చర్యం కలిగించి ఆ వైచిత్రిలోనే నవ్యత, సౌందర్యం

ఉన్నాయంటారు అధి వాస్తవికులు. కొంటెతనపు మాటలు ఆ కోవలోవే, బూర్జువా సమాజ వాస్తవికతను వేళాకోళం చేయడం శ్రీశ్రీకి ఇష్టమే !

ఛందో బందోబస్తులన్నీ తాను ఛట్‌ఫట్‌మని తెంచివేస్తాడట. చెప్పిన మాట చేయకపోవడం కూడా అధివాస్తవికతే. శ్రీ శ్రీ ఛందోబంధాల నెక్కడా త్రెంచనే లేదు. ఇది కేవలం గప్పాలు కొట్టడమే.

ఛందస్సు పాటించినంత మాత్రాన ఏ రచనా కవిత్వం కాదు. ఛందోరహితంగా రచించినంత మాత్రాన ఏ కవితా కవిత కాకుండా పోదు. అయితే ఛందో నిష్టగల వారికి ఛందో రహిత కవిత్వం మీద విశ్వాసం లేకపోవచ్చు. అలాంటి వారు Damn it ఏమిట్రా ఇది అని కోప్పడతారు. దానికి అధివాస్తవికుడు చెప్పే సమాధానం 'Pray it's Poetry' అని. వాక్యాలలో తెలుగునీ ఆంగ్లాన్నీ మిళాయించి చెప్పడం అధివాస్తవిక వైచిత్రియే. లిపినికూడా వాడటం వింత. ధ్వన్యనుకరణ శబ్దాలను విరివిగా వాడటం మరో వింత.

ఛందోబందో, డేమిట్, ఏమిట్, ఛట్‌ఫట్ మొదలైన వాటి శబ్ద వైచిత్రి అధి వాస్తవిక శిల్పం. ఈ శబ్ద సారూప్య సంఘటనే ఛందోలోపాన్ని భర్తీ చేస్తోంది.

*50. రెండు వేషాలు విప్పి వేసిన తలగడాల*
*కింద నిద్రపోతున్న నక్షత్రాలు* **1944**

'శ్రీశ్రీ మార్కు పద్యాలనే పఱుకు' అనే అధి వాస్తవిక ఆత్మ స్తుతికవిత లోని ఒక పాదం ఇది. తనదైన శబ్దక కేళీలోలత్వంతో తనకు ఆధునికాంధ్ర సాహిత్యంలో గల పలుకుబడిని వ్యక్తం చేస్తూ శ్రీశ్రీ రచించిన అధివాస్తవిక వాక్ప్రయోగం ఇది ఈ ఖండికలోని ప్రతి పాదమూ రెండు అనే అర్థమవుతుంది. శ్రీశ్రీలో రెండు శ్రీలుండటమే దీనికి కారణం. ఇవన్నీ శ్రీశ్రీ మార్కు పద్యాలే !

శ్రీరంగం శ్రీనివాసరావు అనే పేరు వేషం విప్పివేయగా మిగిలేవి శ్రీశ్రీ అనే రెండక్షరాలే. వీటికింద నక్షత్రాలలాగ వక్రములుగా కనిపించేవి రెండు రేఫకారాలు. -uu

శ్రీశ్రీ ఇచ్చే 'పజిలు' ఇలాగే ఉంటుంది. ఈ భావచిత్రం గురించి పాఠకుడు గుట్టును విప్పుకోవాలి. * * *

ఎంతో పరిశీలించాలి. కవిగుట్టుగా చెబుతాడు. పాఠకుడు

*51. పెసలో బొబ్బర్లో వే*
*రుసెనగలో విక్రయించి రూపాయలు బో*

*కర్కసమున కెకిరించడమా*
*నిసలైన కవిత్వరచన సిరిసిరిమువ్వా!* *1946*:

శ్రీశ్రీ రచించిన సిరిసిరిమువ్వ శతకంలో 'మొదటి దశ' లోనిది ఈ కందపద్యం.

అందంగా మధురస నిష్యందంగా పతిత్ర హృదయ స్పందంగా కందా లొక వంద రచించేందుకు శ్రీశ్రీకి మనసయిందట. 'ఏవేనా కొత్తవి రాశావా చూపించు' మంటూ చంపేవాళ్ళకోసం తాను సిరిసిరిమువ్వ శతకం రాశానని అవతారికలో చెప్పుకున్నాడు. పరిహాసం, వ్యంగ్యం, సమాజవిమర్శ, సాహిత్య విమర్శ, రాజకీయ విమర్శ ప్రధాన ధ్యేయంగా రచించిన నూరు పద్యాలివి.

ఏది సిసలైన కవిత్వం అని ఎవరైనా అడిగితే శ్రీశ్రీ చెప్పే సమాధానంలో వేళాకోళం ఉంది. కవిత్వం ఒక వృత్తిగా వ్యాపారంగా పరిగణించే వారిమీద ఈ వేళాకోళం. బూర్జువా వ్యవస్థలో కవిత్వం కూడా లాభాల నందిస్తుంది. కిరాణా వర్తకుడు వివిధ ధాన్యాలను విక్రయించి లాభం గడించి ధనవంతుడవుతాడు. లోకానికి వస్తువులను అందిస్తున్నట్లు కనబడతాడు. కవిత్వాన్ని కూడా కొందరు ఇలాగే వ్యాపారంగా పరిగణిస్తూ కృతిపతులనుంచీ పత్రికాధిపతులనుంచీ డబ్బు రాబట్టుకుంటారు. వీళ్లకు కవితాప్రయోజనం గురించి సాంఘిక దృక్పథం లేదు. శ్రీశ్రీకి కవిత్వం సామాజిక విప్లవం కోసమే కానీ ధనార్జన కోసంకాదు. అందుకే కిరాయి రచయితలను వేళాకోళం చేశాడు.

వచనం రాసినంత తేలికగా సులువుగా శ్రీశ్రీ కందపద్యం రాశాడు. పై పద్యంలో పాదాలు తీసివేస్తే వచనమే అనిపిస్తుంది. "పందిని చంపిన వాడే కందం రాయాలటన్న కవిసూక్తికి నా చందా యిస్తానా?" అని ప్రశ్నిస్తాడు కూడా. "కందం తిక్కన గారిది కుందవరపు వారి ముద్దుకుర్రనిదంతే అందరి తరమా కందపుచిందుల కిటుకుల్ గ్రహింప సిరిసిరిమువ్వా" అంటూ ప్రస్తావించిన శ్రీశ్రీ ఆ యిద్దరి కిటుకులూ బాగా గ్రహించినవాడే. "నాలాగ కందబంధ జ్వాలాజాలాగ్ర సంవసత్ సద్గీతా లాలాపించే కవితాశ్రీలోలుడు నహిసహితి సిరిసిరి మువ్వా" అంటూ ఆత్మగౌరవం ప్రకటించుకున్నాడు.

**52.** *కప్పలను తెచ్చి ఒక రా*
*చ్చిప్పం బడవైచి కండచీమలతో కా*
*రప్పిండి జల్లి తింటే*
*చిప్పిల్లును కవనధార సిరిసిరిమువ్వా!* *1946*

సిరిసిరిమువ్వ శతకంలో ఎనిమిదవ దశకం శీర్షిక ఫ్రెంచిభాషలో ఉంది. LES GESTES SURREALISTES అంటే అధివాస్తవికాభినయాలు అని భావం. వాస్తవికతకు విరుద్ధమైన దృశ్యచిత్రం ఈ పద్యంలో ఉంది. అధివాస్తవిక హాస్యం (Super-real humour) ఇది. యథార్థ జగత్తు సుప్తచైతన్యంలో కల్పించిన ప్రతిబింబ మిది. అర్థరహితంగా పైకి కనిపిస్తూ అర్థాంతర ప్రతిపాదన కవకాశం ఇచ్చే భావం గోచరించడం వైచిత్రి. అధి వాస్తవికతను సామాజిక స్పృహతోనే ప్రయోగిస్తాడు శ్రీశ్రీ.

నైసర్గిక ప్రతిభవల్లగానీ నిరంత రాభ్యాసంవల్లగానీ సిద్ధించవలసిన కవిత్వం మందులు సేవించడం వల్ల కూడా లభిస్తుందని కొందరు భ్రమిస్తారు. అప్పకవీయంలో సారస్వతౌషధాలను గురించి వివరణ ఉంది. ''వలమాటి తుంగ ముస్తలును వసయు సమములుగఁ దూచి పొడిచేసి సంతతంబు ప్రొద్దునను లేచి నేతితో ముద్దఁజేసి కర్షమాత్రంబు భక్షింపఁ గలిగెనేని గడియకొక పద్యశతకంబు నుడువుటరుదె?'' ఈ అభిప్రాయానికే శ్రీశ్రీ సవాలు.

కప్పలు, కందబీములు, కారం— మూడింటినీ కలుపుకుని తినడం అనాగరికమైన పని. ఈ అమానుష చేష్ట అధివాస్తవిక పద చిత్రం. ఇక్కడ భక్ష్యంగా చెప్పబడిన కప్పలు, కందబీమలు, కారం—మూడూ కకారాదులయినంత మాత్రాన కవనధార కలుగుతుందనుకోవడం వింత. వశంవదాలు కాని శబ్దాలను (కప్పలు), పాతబాణీలో (రాచ్చిప్ప) పాత కవి సమయాలతో, అలంకారాలతో (కందబీమలు) సమాస గుంఫనతో (కారప్పిండి) రచనలు తయారు చేయడానికి యత్నిస్తే కవనధార రాదని కూడా ధ్వని.

ఈ కంద పద్యంలో కవనధార ఒక్కటీ సంస్కృత పదబంధం కావడం, పరికరాలన్నీ దేశ్యాలు కావడం సాభిప్రాయంగా కనిపిస్తుంది. ఒక మహోత్కృష్టమైన ఫలం పొందడానికి అల్పమైన ప్రయత్నాలు సరిపోవు. ఇది అకవి విమర్శ.

*53. జట్కాలకీ సైకిళ్లకీ*
*రిక్షాలకీ మోటార్లకీ రైలుబళ్లకీ*
*ఇత్యాది శకటాలకీ*
*చక్రాలుంటాయ్ ప్రమాణపూర్తిగా ఖరూ !* **1948**

తన మేనల్లుడు ఆరుద్రతో కలిసి శ్రీశ్రీ చెప్పిన రుక్కుటేశ్వర శతకం (అసంపూర్ణం) లో ఆఖరి పద్యం ఇది, జలసూత్రం రుక్మిణీనాథ శాస్త్రికి ఈ

శతకం అంకితం. ఆయన పేరే జ. రు. అదే జరూ అనే మకుట మయిందీ శతకానికి. జరూ అనే మాట 'గురూ'కు పేరడీ.

ప్రస్తుత పద్యం గణయతిప్రాస రహితంగా రచింపబడిన కంద పద్యం. చిన్నప్పుడు శ్రీశ్రీ ఇలాంటి పద్యమే రాశాడట. అది పోనే పోయింది. అది తెలియక రచించినది. ఇది తెలిసే రచించింది. అతి విచిత్ర కవిత్వాధ్యాయంలో ఒక మెరుపు.

ఛందస్సర్ప పరిష్వంగంలోంచి సజీవంగా బ్రతికి వచ్చిన వికటకవి సాక్షాత్కరిస్తాడీ పద్యంలో.

పాద ప్రమాణాన్నిబట్టీ గమన సౌలభ్యాన్నిబట్టీ పై పద్యం సలక్షణమైన కంద పద్యమని భ్రమ కలిగిస్తుంది. కానీ గణవిభాగానికి పూనుకోగానే భ్రమ కరిగిపోతుంది. తొలిపాదంలో 12 మాత్ర లుండవలసిందానికి 14 మాత్రలున్నాయి రెండో పాదంలో 20 మాత్రలకు బదులు 22 మాత్రలున్నాయి. మూడవ పాదంలో 11 మాత్రలున్నాయి. ఆఖరిపాదంలో మాత్రలు సరిపోయినా గణాలు కుదరవు. కంద పద్యంలో 64 మాత్రలుండ వలసి ఉండగా పై పద్యంలో 67 మాత్రలున్నాయి. ప్రాస యతి లేనేలేవు. ఇటువంటి విచిత్ర కందానికి ఈ కవులు ఒక షరా రాశారు.

షరా :- ''ఆఖరి పజ్యంలో గణాలూ యతిప్రాసలూ లేవనుకోవద్దు. శకటాల గురించి పజ్యం కనుక నడతా, వడీ ఎలాగూ తప్పవు. ప్రాస బండీ రా''

లక్షణశాస్త్ర నిర్దిష్టాలయిన గణాలు లేకపోయినా శకటాల గణాలున్నాయని చమత్కారం. జట్కాలు, సైకిళ్లు, రిక్షాలు, మోటార్లు, రైలుబళ్లు - ఇవన్నీ శకటాల గణాలే. ఛందస్సు ఛందస్సుకోసం కాదు. అది ధారాశుద్ధినీ లయనూ గమనాన్నీ భాషకు సమకూరిస్తే అదే ఛందస్సు. అది అనిర్దిష్టంగా ఉన్నాసరే ఛందస్సే. శకటాలకున్నట్లే ఈ పద్యానికి (శకటాలు వస్తువుగా గలది కనుక) 'నడక' తప్పదట! ''వడి'' అంటే వేగమే కాదు; యతి కూడాను. ఈ పద్యంలో యతి పాటింపబడలేదు. కానీ శకటాల వడి(యతి) ఈ పద్యానికుందట! 'ప్రాస' అంటే పాదద్వితీయాక్షరం మాత్రమే కాదు; ఆయుధం (కొరడా) కూడాను. ఈ పద్యంలో ప్రాస (హల్లు) పాటింపబడలేదు. కానీ స్వరప్రాస పాటింపబడింది. దాన్ని మన ఛందశ్శాస్త్రం ఆమోదించలేదు. శకటాలున్నందువల్ల ప్రాస ఉందట!

బండీరా అంటే శకటరేఫమాత్రమే కాదు; శకటానికి పిలుపుకూడాను. ఈ విధంగా శ్లేష వైచిత్రితో గమ్మత్తులు చేసి ఛాందసత్వాన్నీ పరిహసించారు.

గణాలూ యతి ప్రాసలే గాక శకటరేఫలూ అరసున్నాలు కూడా కవిత్వానికి అవశ్యకాలు కావని భావించడం వల్లనే ఈ వెక్కిరింపు.

చక్రాలుంటాయ్ ప్రమాణపూర్తిగా అన్నప్పుడు 'ప్రమాణం' కూడా శ్లేషయుతమే. ఆయా బళ్ళకు తగిన కొలతల్లో చక్రాలుంటాయి. ఈ పద్యం లోని భావం ఉన్మాది ప్రేలాపనను జ్ఞాపకం చేస్తుంది. ఆ ఉన్మాదం అధివాస్తవికతా లక్షణమే.

*54. ఏ స్వాతంత్ర్యం నిమిత్తం*
*ఎవరెవరో ఎందరో దేశసేవా*
*భాస్వంతుల్ బాలవృద్ధుల్*
*పతితులధిక ఉప్రాజ్ఞులున్ ప్రజ్ఞులంతా*
*అస్వాశల్ వీడి లాఠీహతులయి*
*ఉరికొయ్యల్ కవుంగింట చేర్చా*
*రా స్వాతంత్ర్యం లభించిందని విని*
*హృదయం హ్లాద సంపుష్టమైతే* **1947**

భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చిన సందర్భంలో శ్రీశ్రీ ఆకాశవాణి నుంచి వినిపించిన ''మహాసంకల్పం'' లోనిది ఈ స్రగ్ధరాపద్యం.

'సరిహద్దు లెరుంగని సకల జగజ్జనులారా ఇదిగో నా స్వాతంత్ర్యస్వప్నం' అంటూ తాను చిరకాలం నుంచీ కలలుకంటున్న స్వాతంత్ర్యం వచ్చిందని ఉప్పొంగిపోయాడు శ్రీశ్రీ. 1940 లోనే 'ఈ స్వప్నం నిజమవుతుంది' అనుకున్నాడు. ఆ స్వప్నం సామ్యవాదం కానీ ఈ స్వప్నం అందుకు దోహదంచేసే మరో స్వప్నం. పీడకులైన బ్రిటిషువారిని భారతీయులు జయించారు.

సంయుక్త ప్రాసతో వ్యావహారిక భాషలో స్రగ్ధరావృత్తాన్ని నడిపించి ఆ ఉత్సాహాన్ని రూపుకట్టించాడు. ఈ పద్యంలో మరభనయయయ అనే గణాలూ ప్రతిపాదంలోనూ 15వ అక్షరం యతిమైత్రినీ విధిగా పాటించాడు.

స్వాతంత్ర్యం ఎలా లభించిందో జ్ఞాపకం చేసుకున్నాడు. ఇందుకు జరిగిన పోరాటంలో ఎందరో అస్వాశలు (అసు + ఆశలు) విడిచి లాఠీ హతులయ్యారు. ఉరికొయ్యలు కౌగిలించుకున్నారు. వీరులు శృంగార జీవితాలను

కూడా విడిచి మరణాన్నే ప్రియురాలుగా వరించారనే వ్యంగ్యాన్ని ఉరికొయ్యల్ కవుంగిటచేర్చారనే వక్రోక్తి ద్వారా సూచించాడు. బ్రిటిష సామ్రాజ్యవాదుల కిరాతకృత్యాలు జ్ఞప్తికి వస్తాయి లాఠీ, ఉరి శబ్దాలవల్ల. ఇలా మృతులైన వారు అన్ని వర్గాలలోనూ ఉన్నారని చెప్పడానికే బాలవృద్ధులు, పతితులధికులు, అప్రాజ్ఞు లుత్ప్రజ్ఞులు అంటాడు. వీరంతా దేశసేవా భాస్వంతులే.

ఈ పద్యం లోని వాక్యనిర్మాణంలో సంస్కృత సంప్రదాయాన్ని పాటించాడు. ఏ - ఎవరెవరెవరో-ఎందరో-ఆ ఇత్యాదులన్నీ సంబంధ సర్వనామాలు. ఈ పద్యం ఎత్తుకోవడంలోనే ఉపన్యాసావేశం ఉంది.

55. *భూతకాలంపు సరీసృపాలని పాతరాతియుగంలో పాతెయ్ !*
*పాతెయ్ నీ సందేహాలని*
*తోలెయ్ నీ మందాక్షాలని*
*నిటారుగా నిలబడు నేస్తం హుటాహుటిగా ముందుకు సాగు !*
*హుషారుగా ముందుకి సాగు ! ఊరికే వెనక్కి చూస్తావేం !*
*దుప్పివి కుక్కవి కావు తిర్యగ్దృక్కువి నువ్వుకావు*
*దూరం కరిగిపోతోంది*
*కాలం మరిగిపోతోంది*
*మానవుడిగా మేలుకో నేస్తం ఏలుకో ఈ విశ్వం సమస్తం !*

**1948-1953**

సామ్యవాద మహాభారతం అనే కావ్యమొకటి రాయదలచి అందులో అనుశాసనిక పర్వాన్ని మాత్రం పూర్తి చేశాడు శ్రీశ్రీ. ఆ పర్వంలో ఎఏబి ఒకటి అనే ఆరు ప్రకరణాలున్నాయి. అందులో చివరి ప్రకరణంలో చివరి మాటలు పైన మనం చదివినవి.

హేతువాదం, కాలం, ఐకమత్యం, పరిణామం, విప్లవం, దూరం మొదలైన వాటిని గురించి భౌతికవాది చెప్పే మాటలే సానుప్రాససుందరంగా ఈఖండికలో ఉన్నాయి. వచనకవితకు అపూర్వమైన లక్ష్యాలీ గీతాలు.

ప్రస్తుత గీతంలో మానవుడు గతవైభవ స్మరణంతో కాలవ్యయం చేయకుండా వర్తమాన సమాజ సమస్యలను పరిష్కరించుకోవడంలో కర్తవ్యం గుర్తించి భవిష్యత్తును లక్ష్యంగా చేసుకోవాలనే అభిప్రాయం మనోరంజకంగా వ్యక్తం చేయబడింది.

భూతకాలపు సరీసృపాలు అనే భావ చిత్రం సాభిప్రాయం. వాటిని పాత రాతియుగంలో పూడ్చివేయాలని ఉద్బోధ.

సందేహాలు, మందాక్షాలు (సిగ్గులు) విసర్జనీయాలే. భూతకాలపు సరీసృపాలకూ సందేహాలకూ వాడిన క్రియ ఒకటే ! ఆ రెండూ ఒకలాంటివే ! తొలెయ్ పాతెయ్ అనే క్రియలు వాడుకలోంచి వచ్చి గాంభీర్యాన్ని నేర్చుకున్నాయి ప్రయోగ సామర్థ్యంవల్ల !

నిటారుగా - హుటాహుటిగా - హుషారుగా అనే వాటిలో రెండో అక్షరం గురువు కావడం వల్ల వేగం స్ఫురిస్తుంది.

ఊరికే కాదు ఊరిఖే ! ఈ మహాప్రాణం ప్రయోగించడంవల్ల విసుగు వ్యక్తం అవుతుంది. గతకాలము మేలు వచ్చుకాలము కంటెన్ అనుకునే మనస్తత్వాన్ని మందలించడానికే ఈ మాటలు. మంచి గతంలోకన్నా మిన్నగా భవిష్యత్తులో ఉందన్న విశ్వాసం మార్క్సిస్టుది.

నడుస్తూనడుస్తూ బెదురుగా సంకోచంగా వెనక్కి చూడటం జంతువు లక్షణం అనీ ఆలోచనాపరుడైన నిరంతర గమనశీలియైన మానవు డావిధంగా చూడటం మానుకుని చరిత్ర పురోగమనానికి సహకరించాలనీ కవి అభిప్రాయం. ఈ భావాన్ని అతిసులభంగా చెప్పిన మాటలు- 'దుప్పివీ కుక్కవీ కావు తిర్యగ్‌దృక్కువి నువ్వుకావు'

మరో ప్రపంచానికి ప్రయాణం చేయడానికి సిద్ధమైన మానవుడికి జడత్వం పనికిరాదు. అనవరత జాగృతితో ప్రయాణం సాగించాలి. దూరం, కాలం- ఈ రెండిటినీ జయిస్తేనే అతడు గమ్యం చేరుకోగలడు. విజ్ఞానశాస్త్రం అందు సహకరిస్తోంది.

అచ్చమైన మానవుడే - శ్రామికుడే-ఈ సమస్త విశ్వాన్నీ ఏలుకోదగినవాడు. ఫాసిస్టులూ, సామ్రాజ్యవాదులూ, బూర్జువాలూ సామ్యవాద మానవుడికికు విరోధులు.

నినాదాలను కూడా కవిత్వంగా భాసింపజేయడం శ్రీశ్రీ నైపుణ్యం. మానవుడుగా మేలుకో నేస్తం ఏలుకో ఈ విశ్వం సమస్తం వంటివి కవితాత్మక నినాదాలే. పీడకుడు - మానవాంశనే మరచిపోయిన దానవుడు. సమధర్మం కోరేవాడే మేలుకున్న మానవుడు.

56. చెట్టా పట్టాలం
ఫ్యాక్టరీ గొట్టాలం
మృత్యువు బంగళాలో
తొంగిచూసే చుట్టాలం
భగవంతుని నీడలం
అల్లసాని వాడలం
చింతాకు పతకాలం
సిగ్గుమాలిన శతకాలం 1954

ఆరుద్ర, అబ్బూరి వరదరాజేశ్వరరావులతో కలిసి శ్రీశ్రీ రచించిన 'మేమే' అనే వేళాకోళపు కవితలో ఒక గీతం ఇది. ఈ ముగ్గురూ ఆధునిక విదూషకులు.

చెట్టాపట్టాలు స్నేహసంకేతాలు. ఫ్యాక్టరీ గొట్టాలు పారిశ్రామిక చైతన్య సంకేతాలు. ఇలా పదాలను భావాల సంకేతాలుగా వాడటం ఒక యుక్తి.

మృత్యువుకొక బంగళా ఉందట! అందులోకి తొంగిచూసే చుట్టాలట వీరు! సంప్రదాయ భావాలను ఆధునికీకరించే ప్రయత్నం ఇది!

అల్లసాని ఇంటిపేరు విచిత్రమయినది. అందులో సాని శబ్దాన్ని తీసుకుని సాని వాడ అనే పదాన్ని దానికి కలిపి సంక్షేపిస్తే అల్లసాని వాడ అయింది. అల్ల+సానివాడ; అల్లసాని+వాడ. పెద్దన్న కవిత్వానికి పరిహాసాత్మకస్తుతి ఇది. వ్యాజనింద. తామే అల్లసాని వాడలయితే వీరిలో శృంగారం ఎంత ఉందో? సాని వాడల మీదా రాగద్వేషాలు రెండూ ఉన్నాయి.

చింతాకు పతకం అనే పదం రామదాసు కీర్తనలలోది. ఆ కీర్తనలంటే వీరికి మోజు.

సిగ్గుమాలిన శతకం అనగానే స్ఫురించేది కవి చౌడప్ప శతకం. నాగరికత పేరుతో లైంగిక వాస్తవికతను కప్పిపుచ్చుతూ అశ్లీలాన్ని చాటుగా చేయడం వీరి కిష్టంలేదు. ప్రాయిడిస్టులు కదా!

మేమే లో 29 గీతాలున్నాయి. అన్నీ అనుప్రాసవైచిత్రితో సాగే వచన గేయాలే! పై గేయం అష్టపది. హాస్యం దాని ప్రాణం.

57. ఆహా మరి యింతేనా
అందమైన మన మనుగడ?

*మూడునాళ్ల వింతేనా ?*
*జగ మతుకుల బొంతేనా ?*
*మెదడన్నది మనకున్నది*
*అది సరిగా పనిచేస్తే*
*విశ్వరహః పేటికా వి*
*పాటన జరగక తప్పదు !* **1953-68**

భగవంతుడున్నాడా?లేడా ? అనే విచికిత్సలో భౌతికవాది అయిన శ్రీశ్రీ చేసిన కవితాత్మక చర్చ 'సదసత్సంశయం' అనే ఖండిక. అందులోనే ఈ రెండు గీతాలు.

ఈశ్వర జిజ్ఞాసువుల నిజస్వరూపాన్ని బయటపెట్టాడు శ్రీశ్రీ. 'ఎందరో మహానుభావులు బ్రతుకునించి పారిపోయి తమ వెనుకనె దాగువారు' అన్నాడు. ''మరణ మహాసముద్రాన జీవన మొక ద్వీపంలా తమ పాలిటి శాపంలా తల పోసే ఫిలోఫర్లు'' అంటూ తాత్త్వికులను పరిహసించాడు. ఆత్మ సిద్ధాంతాన్ని నిరాకరించాడు. మేధ కతీతంగా ఆత్మ అనేది లేదంటాడు మార్క్సిస్టు.

జీవిత సమస్యలను పరిష్కరించుకోలేక పోవడం క్షంతవ్యం కాదంటాడు శ్రీశ్రీ. మానవ జీవితం 'మూడునాళ్ల వింత' కాదు. ఈ లోకం 'అతుకుల బొంత' కాదు. జీవితం మూణ్ణాళ్ల ముచ్చట అనీ లోకం అతుకుల బొంత అనీ అనేది విరక్తులే !

ఆత్మకన్నా గొప్పది మానవుడి మస్తిష్క వైభవం. సృష్టి రహస్యాలను కనుక్కోలేనంత కాలమే దైవశక్తి మీద విశ్వాసం. మానవ మేధాశక్తి విజృంభిస్తే నిజం బైటపడుతుంది. పరిశోధనల వల్ల విశ్వరహస్యాల పేటికను పగుల గొట్టవచ్చునని కవి వాదం.

'రహః పేటికా విపాటనం'అనే రూపకం భౌతిక వాదుల తార్కిక విజ్ఞాన సాహసాలను సూచిస్తోంది

*58.* *విప్లవం ముమ్ముందు మనుష్యుని*
*మనస్సులో ప్రారంభమవుతుంది*
*మనః ప్రపంచానికి బాహ్యాస్వరూపం భాష*
*భాషా విప్లవమే భావ విప్లవం !* **1953**

1953 అక్టోబరు 1 వ తేదీన ఆంధ్రరాష్ట్రం అవతరించిన సందర్భంలో శ్రీశ్రీ రచించిన 'ఒకటి - పదీ' అనే వచనకవిత నుంచి ఈ పంక్తులు. ఆంధ్ర రాష్ట్రోద్యమం గురించి శ్రీశ్రీ 'విషాదాంధ్ర' వంటి గేయాలు రచించి ఆందోళన ప్రకటించి ఉన్నాడు. రాష్ట్రావతరణం శ్రీశ్రీ స్వప్న సాఫల్యమే మరి.

"ఈ రాష్ట్రం ఇదిగో ఇప్పుడే చెబుతున్నా ఏదో కొందరి సదుపాయాని కేర్పడలేదు." అని హెచ్చరిస్తూ "ముక్కోటి ఆంధ్రుల అకుంఠితదీక్ష అజేయ సంకల్పం ఆంధ్రావతరణకి కారణం" అని నిర్ధారించేచాడు ప్రజల ఉద్యమాన్ని గౌరవించాడు." సామాన్యుడిదే ఈ రాష్ట్రం అతనికోసం ఈ రాష్ట్రం" అంటూ పెత్తనం చెయ్యాలని ముందుకొచ్చే పెద్దలను హెచ్చరించాడు.

సామ్యవాద విప్లవానికి భారత స్వాతంత్ర్యాన్ని ఒక మెట్టుగానూ ఆంధ్ర రాష్ట్రాన్ని మరో మెట్టుగానూ శ్రీశ్రీ భావించాడు.

ఆంధ్రదేశంలోని సామాన్యుడు బాగుపడాలంటే సామ్యవాద విప్లవం రావా అనే శ్రీశ్రీ ఆశయం. ఆంధ్రరాష్ట్రం అందుకు ఎలా దోహదం చేస్తుందో వివరించాడు. ఆ సందర్భంలోనివే పైమాటలు.

దేశంలో వర్గ నిర్మూలనానికి భావ విప్లవం రావాలి. భాషావిప్లవం భావ విప్లవానికి నాంది. భావానికి జన్మస్థానం మనస్సు. దానికి బాహ్య స్వరూపం భాష. మనుష్యుల మనస్సులలో ఆరంభంకాని విప్లవం కియారూపం ధరించదు. భాష ఒక శక్తివంతమైన ఆయుధంగా రూపొందాలంటే దాన్ని పోషించి, సంస్కరించి ఉపయోగించుకోవాలి. ఆంధ్రరాష్ట్రం ఆంధ్రభాషా విప్లవానికి దోహదం చేస్తుందని భావించాడు శ్రీశ్రీ.

గిడుగు, గురజాడ, వీరేశలింగం గార్లు భాషాభావ విప్లవాలను కొంత వరకు సాధించారు. కానీ వారు సాధించిన విప్లవం సామ్యవాదం కోసం కాదు. వ్యావహారిక భాష సమ సంస్కరణకు దోహదం చేసినట్లే సామ్యవాద విప్లవానికి కూడా దోహదం చేస్తుందని శ్రీశ్రీ అభిప్రాయం. వాడుక భాషను విప్లవ సాధనంగా వాడుకున్న వాడు శ్రీశ్రీయే. ఆంధ్రరాష్ట్రం వచ్చిన తరువాతనే విద్యావంతుల సంఖ్య పెరగడం, పఠనాసక్తి హెచ్చడం, శ్రీశ్రీ భావాల ప్రచారానికి దోహదం చేశాయి.

తెలుగుదేశంలో ఈనాటి భాషా – భావ విప్లవాలకు శ్రీశ్రీ ఒక చారిత్రక పాత్ర అయ్యాడు.

59. ఏమో బహుశా త్వరలో
మీ ఇంటికే రావచ్చు మేము
స్వాగతం ఇస్తావు కదూ
ఆతిథ్యానికర్హులమే మేము
చంద్ర మండలానికి ప్రయాణం
సాధించరాని స్వప్నం కాదు
గాలి కన్న బరువైన వస్తువుని
నేలమీద పడకుండా నిలబెట్టలేదూ 1954

'శరచ్చంద్రిక' అనే ఖండికలో శ్రీశ్రీ చందమామతో తాను మాట్లాడు తున్నట్లు చేసిన కల్పనలోని భాగం ఇది. భావకవులు చంద్రుణ్ణి సంబోధిస్తూ రాసిన అనేక ఖండికలకూ దీనికీ ఎంతో తేడా ఉంది. వాస్తవికత, వైజ్ఞానిక చారిత్రక దృక్పథం, అభ్యుదయ భావన గల కవి పాత వస్తువునే సరికొత్తగా నిర్వహించ గలగడానికి 'శరశ్చంద్రిక' నిదర్శనం.

జాబిల్లిని ఒక మిత్రుడిగా భావించి, అతడితో మానవ జగత్తును గురించి ముచ్చటించాడు శ్రీశ్రీ. ప్రపంచ విమర్శ ప్రధాన విషయమయింది శ్రీశ్రీ కవితా ప్రసంగానికి.

మానవుడు కొద్ది రోజుల్లో చంద్రలోకం మీదికి దిగుతాడని నమ్మాడు శ్రీశ్రీ. ఈ గీతం రాసే నాటికి (1954) చంద్రలోక యాత్ర (1969) ఇంకా జరుగనే లేదు.

మానవుడు సాధిస్తూ వస్తున్న ప్రకృతి విజయాలే శ్రీశ్రీకి అలాంటి నమ్మకం కలిగించాయి. వైజ్ఞానిక శాస్త్రం ఎలాంటి పురోగమనాలు సాగిస్తున్నదో తెలుసుకునే కవులెంత మంది ఉంటారు ? శాస్త్రీయ విజ్ఞానం గల ఆధునిక కవుల్లో శ్రీశ్రీ అగ్రేసరుడు.

కవిత్వం పేరు చెప్పేసరికి కాల్పనిక లోకాలలోకి ఎగిరిపోవడం తెలుగు కవుల అలవాటు. మాట్లాడుకున్నంత తేలికగా అసామాన్యమైన ఊహలను సామాన్యంగా చెప్పడం శ్రీశ్రీ అలవాటు. తెలుగు నుడికారం శ్రీశ్రీకి వాగా లొంగింది.

60. బస్తాలకు బళ్లకెత్తు
పద్యాలా కవిత్వం ?

ప్రాచీనత పవిత్రమా
పనికి రాదా నవత్వం ?
ప్రపంచాన్ని చూడలేని
కవిత నిజం చూపదు
ఇసకలోన తలదూర్చిన
ఉష్ట్రపక్షి బాపతు 1954

శ్రీశ్రీ ప్రయోగాత్మకంగా సృజించిన ప్రయోజనాత్మక పరిహాస రచనలు 'ప్రాసక్రీడలు'. సమకాలీన నికృష్టపరిస్థితిని బట్టబయలు చేసి సుఖజీవన సాధకమైన ఉజ్జ్వల భవిష్యత్తు వైపు చూపుడు వ్రేలుగా రచనలు సాగాలని శ్రీశ్రీయే చెప్పుకున్నాడు. శ్రీశ్రీలోని విదూషకుడు లోకశ్రేయస్సును కోరేవాడే కానీ వినోదమాత్ర లాలసుడు కాడు. ఇందుకు వేమన తనకు ఆదర్శం అన్నాడు. ఒక Sense of humour అనే తల్లివేరు జీవితమృత్తికనుంచి చైతన్య పోషకమైన పదార్థాలను అనుక్షణమూ తన కవిత్వాని కందిస్తూ ఉంటుందని ఈ ప్రాసక్రీడలను గురించే శ్రీశ్రీ అన్నాడు. ''ప్రాసక్రీడ హాస్యానికి పసందైన బాణం'' మరి. ఆహ్లాదపరుస్తూనే గాయపరిచి సంస్కరిస్తుంది ప్రాసక్రీడ. ఈ పదబంధంలో అధివాస్తవిక లైంగిక వైచిత్రి కూడా ఉంది.

పత్రికలో కార్టూనులు పడటం చూశ్శేదూ ? పద్యంలో ఆ మాదిరి పద్ధతి వీల్లేదూ అని ప్రశ్నించి విమర్శ స్వేచ్ఛను సంపాదించాడు శ్రీశ్రీ.

ఉదాహృత ప్రాసక్రీడలలో ప్రాచీన కవితారీతినీ, భావకవితారీతినీ ఎత్తిపొడిచాడు. సంప్రదాయ కవితావాదులు కవిత్వానికి రాశి, ప్రాచీన లక్షణావలంబం కావాలంటారు. ఆధునిక యుగంలో విశ్వనాథ అనుయాయుల మీద ఈ విసురు భావ కవితావాదులు సమాజవాస్తవికతతో తమకు నిమిత్తం లేదంటారు. ఇలాంటి వారిని ఉష్ట్రపక్షులని వేళాకోళం చేశాడు. ఇది కృష్ణశాస్త్రి అనుయాయులమీద విసురు.

రాశినే కాదు; దీర్ఘ కవితలను కూడా శ్రీశ్రీ వ్యతిరేకించాడు. లక్షణాన్ని వ్యతిరేకించి ప్రయోగాన్ని అభిమానించాడు. సమకాలీన ప్రపంచాన్ని చూసి ఆ సమస్యలమీదనే కవిత్వం రాయాలన్నాడు.

ప్రాసక్రీడలు మాత్రాబద్ధాలు, అనుష్టుప్పులవలె చిన్నవి. సరిపాదాలకు అంత్యానుప్రాస దీనికి రూపం ఇస్తుంది.

61. ఫై - ఫై
ఫైనార్ట్సూ ఫైనాన్సూ కలిస్తే
రెండూ ఒకే విశ్వరూపం ధరిస్తే
కాపిటల్ గా ఉంటుందిగాని స్మరిస్తే
మనలాంటివాళ్ల కదో అవస్థే
అటువైపు వెళ్లొద్దు మిత్రమా నమస్తే

శ్రీశ్రీ రచించిన లిమఋక్కులలో ఒక లిమరిక్కు ఇది. ఆంగ్లంలోని లిమరిక్కును శ్రీశ్రీ లిమఋక్కుగా మార్చాడు. లిమరిక్కులు + ఋక్కులు కలపగా ఏర్పడిన పోర్టుమాంటో పదం లిమఋక్కు. ఐదుపాదాలతో నియతాంత ప్రాసలతో నడిచే పరిహాసగీతం లిమరిక్కు. శ్రీశ్రీ లిమఋక్కు దానికి స్వతంత్రాను సృజన. ఆధునిక చాటువులు లిమఋక్కులు. మాటల పొదుపు, అనుప్రాసలు, పదునైన చమత్కారం, సామాజిక వైయక్తిక విమర్శ, ఆశ్చర్యం కలిగించే ముగింపు, పరిహాసం, బాల్యచాపల్యం, అర్థవికలత మొదలైనవి శ్రీశ్రీ లిమఋక్కుల లక్షణాలు. ప్రతి లిమఋక్కుకూ చమత్కార శీర్షిక ఉంటుంది. ''ఆకర్షిస్తుంది నన్ను లిమరిక్కు అందులో ఏదో వుంది చమక్కు దాని రైమ స్కీముకు భిషక్కునై ఇదోరకం లిరిక్కు తయారు చేశాను భాయీ అలక్కు'' అని చెప్పుకున్నాడు శ్రీశ్రీ.

ప్రస్తుత లిమఋక్కుకు శీర్షిక ఫై - ఫై అంటే ఫైనార్ట్సూ ఫైనాన్సూ అని సంకేతం. ఈ పదాల మొదటి అక్షరాలే ఫై - ఫై. ఇది అమ్మకపు (టీ - టీ) కు అనుకరణ.

లలితకళలతో డబ్బును ముడిపెడితే పెట్టుబడి పెరుగుతుంది. లలిత కళలు దెబ్బతింటాయి. పెట్టుబడిదారుల వైయక్తికాభిరుచులకు కళాకారులు బానిసలు కావలసి వస్తుంది. కళాకారులు అలాంటి ప్రయత్నాలు చేయకుండా ఉండటమే మంచిదని శ్రీశ్రీ అభిప్రాయం. ఒక మిత్రుడికిది సలహా అవుతోంది. ఇది సినిమాలపై ఛలోక్తి కావచ్చు.

* * *

62. ఈ కత్తి
బూజు పట్టిన భావాలకి
పునర్జయం ఇవ్వడానికి కాదు
కుళ్ళిపోతున్న సమాజ వృక్షాన్ని
సమూలచ్ఛేదం చెయ్యడానికి

*దీన్ని*
*నల్లబజారు గుండెల్లో దించు*
*దీనితో*
*కల్లకపటాలను వధించు!* **1966**

'ఖడ్గసృష్టి' అనే వచన గేయంలోనివి ఈ పంక్తులు. సమకాలిక సామాజిక రాజకీయ వ్యవస్థల మీద తిరుగుబాటుగా రచించిన కవిత ఇది.

దేశంలో ఈనాడు బూర్జువాల పెత్తనం సాగుతోంది. అవినీతి, అన్యాయం వారివల్లనే పెరిగిపోతున్నాయి. పేద ప్రజలు వారిచేత పీడితులవుతున్నారు. అందువల్ల శ్రీశ్రీ పేదల పక్షంలోకి వచ్చాడు. బూర్జువా వ్యవస్థవల్ల కలిగే అనర్థాలను తొలగించడానికి అహింసా సిద్ధాంతం పనికిరాదని శ్రీశ్రీ నిశ్చయం. "అహింస ఒక ఆశయమే కాని ఆయుధం ఎప్పుడూ కాదు. ఆశయం సాధించాలంటే ఆయుధం అవసరమే మరి— అందుకే అంటున్నాను నేను అందుకో ఆయుధం అని" అన్నాడు శ్రీశ్రీ. అహింస అనే ఆశయాన్ని సాధించడానికి సామ్యవాదం రావాలి. సామ్యవాదం రావడానికి 'హింస' అవసరమవుతుంది. అందుకే శ్రీశ్రీ 'ఖడ్గసృష్టి' చేశాడు. ఈ ఖడ్గం యొక్క ప్రయోజనాన్ని పై పంక్తుల్లో స్పష్టం చేశాడు. శ్రీశ్రీ ఖడ్గం ప్రజా చైతన్యం; ప్రజా విప్లవం; విప్లవ కవిత్వం.

"అందుకే సృష్టిస్తున్నాను అధర్మ నిధనం చేసే ఈ ఖడ్గాన్ని. కలంతో సృష్టిస్తున్న ఖడ్గం ఇది" అన్నారు.

అధర్మ నిధనం ఖడ్గ ప్రయోజనం. ఏదిధర్మం? ఏదిఅధర్మం. బూర్జువాల ధర్మాలు ప్రజలకు అధర్మాలు. ప్రజల ధర్మాలు బూర్జువాలకు అధర్మాలు. ఇదే యుద్ధానికి మూలం.

బూజుపట్టిన భావాలను పునరుద్ధరించడానికీ కుళ్లిపోతున్న సమాజాన్ని ఇంకా కుళ్లపెట్టడానికీ బూర్జువాలు యత్నిస్తారు. నల్లబజారును వృద్ధిచేస్తారు. కల్లకపటాలను పెంచుతారు.

వీరిమీద కత్తిదూస్తాడు శ్రీశ్రీ. నీడనీ, ఫలాన్ని, పువ్వుల్నీ ఇచ్చి సమాజాన్ని పోషించాలి సమాజవృక్షం. కానీ అంధవిశ్వాసాలు, చాదస్తాలు, స్వార్థపరత్వాలు సమాజాన్ని చుట్టుకొని ఉన్నాయి. హేతువాదాన్ని సమాజం తిరస్కరిస్తోంది. ఇలాంటి సమాజాన్ని సమూలచ్ఛేదం చేయాలట!

సామ్యవాద నిబద్ధతగల శ్రీశ్రీ తాను చెప్పదలచిన సందేశాన్ని వాచ్యంగానూ చెబుతాడు. ప్రజానీకాన్ని ఆచరణకు ప్రేరేపించాలి కనుక ప్రచారధోరణి తప్పదు. అయితే అందులోనూ క్లుప్తత, రమ్యత ఉంటాయి. స్పష్టత ఉంటుంది. కుండ బద్దలు కొట్టినట్లు గొంతువిప్పి అరుస్తాడొక్కొకచోట. నల్లబజారు అనేమాట అలాంటిదే. నల్లబజారు గుండెలు చమత్కారవంతమైన మాట. బ్లాక్ మార్కెటీర్ ఎవరు? అధిక లాభాలు సంపాదించగోరే పెట్టుబడిదారుడే. ఇతనికి మంచిమాటలు చెప్పి అహింస పాటించి మార్చడం అసాధ్యం. అందుకే హింస అనివార్యం.

కల్ల, కపటం ఈ రెండూ ఆ గుణాలుగల వారికి ప్రతినిధులే. వీరిని వధించడం వల్లనే ప్రజాపీడన తొలగుతుంది. ఇందుకు అహింస పనికిరాదు.

63. *ఊరుకుంటానా నేను*
*కనిగా కసాయిగా*
*ఉపద్రవంలాగ ఉవ్వెత్తుగా లేచి*
*సంహారాన్ని స్యందనం చేసి*
*ఉద్రేకతరంగాలే తురంగాలుగా*
*ఆగ్రహం కొరడాని చేబూని*
*సాయుధ విప్లవ బీభత్సుని సారథినై*
*భారత కురుక్షేత్రంలో*
*నవయుగ భగవద్గీతా ఘుంఘుని ప్రసరిస్తాను*
*మంటల చేత మాట్లాడించి*
*రక్తంచేత రాగాలాపన చేయిస్తాను* **1970**

1938 లో శ్రీశ్రీ విప్లవ కవిత్వం మొదలు పెట్టాడు. ఆ తరువాత అభ్యుదయ రచయితల సంఘం ఏర్పడి శ్రీశ్రీని అభ్యుదయ కవి అంది. అలాగే 1970 లో విప్లవ రచయితల సంఘం అవతరించి శ్రీశ్రీని 'విప్లవ కవి' అంది. శ్రీశ్రీ అరసంనుంచి విరసంలోకి ప్రవేశించాడు. విప్లవోద్యమాల పట్ల శ్రీశ్రీకున్న అభిమానమే అందుకు కారణం. విరసంలో ప్రవేశించిన శ్రీశ్రీ మరింత తీవ్రమైన విప్లవ నిబద్ధతతో కవిత్వం రాయసాగాడు. మాత్రాచ్ఛందస్సులను వదిలి స్వేచ్ఛాచ్ఛందస్సులలో తన విప్లవ వాణిని వినిపించాడు. కవిత్వభాషగా మాండలికాన్ని కూడా చేపట్టాడు.

పైన ఉదాహరింపబడిన గీతభాగం ఝంఝ అనే వచనగేయంలోది. ఈ గేయంలోని వక్త శ్రీశ్రీ అనే శ్రీకృష్ణుడు. అతని విప్లవ ప్రతిజ్ఞయే ఈ గేయం. బూర్జువాలు కౌరవులు. కార్మికులు పాండవులు. కానీ పాండవులే ఇక్కడ మెజారిటీ వర్గం. కౌరవులే మైనారిటీ వర్గం. వీరు పీడకులు. వారు పీడితులు. పీడకులకు తొలుత తాను కొన్ని మంచి మాటలు చెప్పి చూశాడు. "ఘోషించాను మంచిగా ఉండండర్రా అంటూ గోల పెట్టాను అమాయకుల జోలికి పోకండర్రా అంటూ కల్మషాలను మానసాలలోంచి కడిగేసుకోండర్రా అన్నాను కళ్ళలో కాంతులు పోగేసుకొమ్మన్నాను గతాన్ని నెమరేసుకోవడం మానేసుకొమ్మన్నాను మొర పెట్టాను మొత్తుకున్నాను మెత్తగా బతిమాలుకున్నాను"

కానీ బూర్జువాలు "విన్నారు కారు వేలాడుతున్నారు భూతకాలం చూరు పట్టుకొని విలువలకి వింత వ్యాఖ్యానం చేస్తున్నారు. పాతని బతికించడానికి కొత్త చిట్కాలు వెతుకుతున్నారు. కొత్తవి హతమార్చడానికి పాత కత్తులు నూరుతున్నారు."

అందుకే శ్రీశ్రీకి కోపం వచ్చింది. రాయబారం లాభం లేదు. అహింస పనికిరాదు. విప్లవశంఖం పూరించాలి. అయితే తాను కాదు యుద్ధం చేసేది. తాను సారథిగా మాత్రమే ఉంటాడు. ఎవరికి? సాయుధ విప్లవ బీభత్సుడికి. సమసమాజావిర్భావానికి 'సాయుధ విప్లవం' రావాలి. ఇదీ విప్లవ రచయితల అతివాదం. ఇలాంటి సాయుధులు పీడితులే. వాళ్ళను అర్జునులతో పోల్చుకున్నాడు. ధనంజయునిలా లేవండి అని 1934 లోనే అన్నాడు శ్రీశ్రీ. మళ్ళీ అదే ధ్వనిస్తున్నాడు. ఇది కురుక్షేత్ర ధర్మ సంగ్రామం. పిరికి మందు త్రాగుతున్న పీడితులకు 'నవయుగ భగవద్గీతా ఝంఝ' తన విప్లవ కవితా నినాదాలే. తన స్యందనం సంహారమే. తన తురంగాలు ఉద్రేకాలే. తన కొరడా ఆగ్రహమే.

రూపకాలన్నీ పాతవే వాటినే సరికొత్త అవసరానికి వాడుకున్నాడు.

కేవలం వాస్తవికతా చిత్రణ మాత్రమే విప్లవ కవిత్వానికి ధ్యేయం కాదు. ఆశయం సాధించడానికి ఆచరణకు పీడిత జనావళిని ప్రేరేపించడం విప్లవకవితా పరమలక్ష్యం. అందుకే మంటల చేత మాట్లాడించి రక్తంచేత రాగాలాపన చేయిస్తానన్నాడు. నిజానికి ఇదే విప్లవ కవిత్వానికి మూల సూత్రం.

'ప్రతిజ్ఞ' శ్రీశ్రీ భారత స్వాతంత్ర్యానికి ముందు చెప్పిన మానిఫెస్టో గీతం. స్వాతంత్ర్యానంతరం శ్రీశ్రీ మానిఫెస్టో గీతం ఝంఝ.

''ఇప్పుడు మనం 20 వ శతాబ్దంలో ఉన్నాం. ఈ శతాబ్దం నాది (తెలుగు సాహిత్యానికి సంబంధించినంత వరకు)'' అని శ్రీశ్రీ 1972 లో ప్రకటించుకున్నాడు సాహసంగా. ఈ సాహసం శ్రీశ్రీ రక్తలక్షణం. 1926 నుంచి కవితా రంగంలోకి ప్రవేశించిన శ్రీశ్రీ ఈ సాహసంతోనే కవిత్వం రాస్తున్నాడు. ఈ సాహసాన్ని పీడితవర్గమంతా శ్రీశ్రీ కవిత్వం నుంచి పొంద గల్గితే శ్రీశ్రీ ఆశించే సామ్యవాద విప్లవం సిద్ధిస్తుంది. శ్రీశ్రీ 'వీరోచితం' గా పోరాడుతున్నాడు కవిత్వం అనే ఆయుధం ధరించి. అందువల్ల శ్రీ శ్రీ కవిత్వం సాహిత్యంలో 'సాయుధ విప్లవం' అవుతోంది.

''ఈ వ్యవస్థను మార్చాలని ఉద్ఘోషించడం కన్నా ఇంకో ఉత్కృష్ట ధర్మం ఏ సాహిత్యపరుడికైనా ఎలా ఉంటుందో నేనూహించలేను. మరి యీ వ్యవస్థకి రకరకాలుగా కొమ్ముకాచే రాతగాళ్లంతా నా దృష్టిలో ప్రజాద్రోహులే'' అంటూ బూర్జువా రచయితలకు ప్రతిస్పర్థి అయ్యాడు శ్రీ శ్రీ. ఇదే శ్రీ శ్రీ నిజాయితీ.

శ్రీ శ్రీ కవిత్వం సామ్యవాద విప్లవం కోసం !<br>
శ్రీ శ్రీ విప్లవం సామ్యవాద జీవితం కోసం !





# యువభారతి

## సాహిత్య సమావేశాలు

సమాజంలో సామరస్యాన్ని పెంపొందించేందుకు సాహిత్యం కంటె ఇతర సాత్త్విక సాధనం లేదనే విశ్వాసంతో గడచిన పదహారు సంవత్సరాలుగా కృషి చేస్తున్న సంస్థ 'యువభారతి'. మనిషిలో అంతర్లీనంగా ఉన్న ప్రతిభా పరిమళాలు పరివ్యాప్తం కావడానికి యువభారతి ప్రతీనెలా మొదటి, మూడు ఆదివారాలలో సుల్తాన్ బజార్‌లోని శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయంలో సాయంత్రం 5 నుండి 8 గంటల వరకూ సాహితీ సమావేశాలు నిర్వహిస్తున్నది. ఈ సమావేశాలకు సహృదయులందరూ ఆహ్వానితులే!

● చుట్టూతా ఆవరించుకుని వున్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడం కంటె, ప్రయత్నించి ఎంత చిన్న దీపాన్నయినా వెలిగించడం మంచిది ●




తెలుగు ఎదలో తెలుగుతనం
వెల్లువలా పారాలని
తెలుగింటిలో తెలుగుదీపం
అఖండంగా వెలగాలని
ఈ జాతి నిద్రలేచి
మహోన్నత మానవాదర్శాల వైపు
నిరంతర కృషితో
పయనం కొనసాగించాలనే ధ్యేయంతో
ఉడుతాభక్తిగా యువభారతి కృషిచేస్తున్నది
భాషాభిమానం కలగాలంటే
మాతృభాషా సాహిత్య పఠనమే
ప్రథమ కర్తవ్యం అనే భావం
బలంగా మనసులో నాటుకోవడానికి గాను
వీలైనంత ఎక్కువ మందికి వీలైనంత తక్కువ వెలకు
ఉత్తమసాహిత్యాన్ని అందించేందుకు
యువభారతి పూనుకున్నది
ప్రతి తెలుగింటిలో
కనీసం పదయినా తెలుగు పుస్తకాలు ఉండేందుకు
మనందరం [illegible]గంతో కృషిచేద్దాం
ఆ పదిమంది పుస్తకాల్లో ఏ [illegible]నా
యువభారతి [illegible]సం
ఉండాలనే ధ్యేయంతో కృషిచేద్దాం

# యువభారతి

సాహితీ, సాంస్కృతిక సంస్థ
5, కింగ్స్‌వే, సికిందరాబాదు - 3

